కచ్చియ. వై. వి. రూ-కచ్చె. కలహము చూ, యుద్ధము

కచ్చూరకము. సం వి. అ పుం =కచోరము * చూ, షడ్గ్రంథ.

కచ్చూరము సం వి అ పుం.= —వై.—

కచ్చె. వై. వి. చూ, రూ-కచ్చియ

కచ్చెపోతు ద్వ. విణ. కలహశీలుఁడు చూ, పేచీకోరు.

కచ్చేరి. వై వి.=కాలీచి చూ, రూ-కచ్చేరి.

కచోరకము. వై. వి = కచూరకః * చూ, షడ్గ్రంథ (దీనిరసము మిరియపు యుండిన కంఠ స్వరము బాగుపడును.)

కచ్చే. వై. వి. 1 ఉపస్థ చూ, భగము. 12, 2.=కచ్ఛా వెనుకకుఁ జెక్కుకొనెడి దోవతి కొంగు చూ, వలి. 2, 3, కట్టుకొన్న దోవతి కొంగు కుచ్చెళ్లు చూ,పింజె. 4, 4 కాసియ. "ఆ. కచ్చె యమరఁబట్టి కాళ్లును జేతులు, వ్రేల మత్తగజము లీలమెఱయ నెత్తురొలుక మల్లునెత్తివైచె" భార విరా. 2, ఆ 17 చూ,దట్టి 1, 5. కాపీనము, గోఁచి "సీ. మొల కచ్చెకట్టు వైరులఁగిన పచ్చని నునుఁగొంగు దిండుగానులిచికట్టి" హరి పూ. 7, ఆ. 13 చూ, బొట్టము

కచ్చెఁగట్టు ద్వ. అ. క్రి కాసెబిగించు చూ, దట్టిఁగట్టు

కచ్చెడము. వై వి 1 =కచ్ఛటా గోఁచి. స్వా 2, ఆ 73 చూ, బొట్టము, దే. వి. 2. దూది జీలకట్టు లోనగువానిఁ దెచ్చెడు బండి చూ, శకటము 1.

కచ్చెమొదలు. ద్వ. వి యోనిమూలము చూ, భగము. 12.

కచ్చు. దే. వి. 1. గర్వము కాశీ. 1, ఆ. 122 చూ,హంకారము, వై.వి. 2. ఆశ పాండు 2, ఆ 11. చూ, వాంఛ; దే. వి. 3. పువ్వుదళ ము. వసు 4, ఆ. 133: చూ, సంవర్తిక; 4. సిగబంతి "ఎ, గీ, భానుబింబంబుపొడిచెఁ బ్రిభాతలక్ష్మి, కబరిభాగంబుమీఁది చెంగ లువకచ్చు." కాశీ. 3, ఆ చూ, భూష ణము. 2; స క్రి. 5. సారె లోనగువాని సడపు చూ, కచ్చించు. 1

కచ్చుకొను. దే. స. క్రి. ఆశించు రసి. 5, ఆ. 159 చూ, వాంఛించు.

కచ్ఛ సం.వి అ స్త్రీ. 1. చిమ్మట చూ, ఱిల్లు; 2. =కచ్చె గోఁచి చూ, బొట్టము, 3 బ్రాహ్మి మొదలగు మాతృకలలో నొకతె చూ,మాతృ కలు, 4 అల' చూ, వీచి. 1, 5 ఆఁడుపంది. చూ, పంది, 6. నీళ్లుగలనేల చూ, భూమి 1, 7 కచ్ఛదేశము చూ, దేశము.

కచ్ఛటిక. సం వి అ. స్త్రీ = కచ్చెడము, గోఁచి చూ, బొట్టము.

కచ్ఛపము. సం వి అ. పుం. 1 కమఠము చూ, తాఁబేలు, 2. నవనిధులలో నొకటి చూ, లిబ్బి 1, చూ, నిధులు, 3. జెట్టీల హస్తీపట్టు: చూ, మల్లశాస్త్రము.

కచ్ఛపి అం తతవాద్యములు ఇరువదింటిలో నొకటి చూ, తతవాద్యములు

కచ్ఛపసంస్థానము సం. వి. అ పుం. నీరుపంది చూ, పంది.

కచ్ఛపి సం వి. ఈ. స్త్రీ. 1. ఆఁడుతాఁబేలు చూ, తాఁబేలు, 2 వదనఖర్జువు చూ, మొటిమ. 1; 3. సరస్వతియొక్క వీణ' చూ, వీణె, అం. 4. తతవాద్యములు ఇరువదింటిలో నొకటి' చూ, తతవాద్యములు

కచ్ఛపిక. సం. వి అ. స్త్రీ. క్షుద్రరోగము: చూ, రోగము. 1.

కచ్ఛము సం. వి అ. పుం 1.=కచ్చెవెనుకఁ జెక్కుకొను దోవతికొంగు చూ, వలి. 2; 2.=కచ్చె. గోఁచి' చూ, బొట్టము, 3. నీళ్లు

చిదచిదయగునేడు నేల, కస్నేము చూ, భూమి. 1, 4. ఓడయంగము, 5. ఒడ్డు చూ, తీరము, 6. పూఁదోఁట చూ, వనము 2, 7. ప్రైవు చూ, పార్శ్వము. 2; 8. కుణి* చూ, నంది; 9. నది మొదలగువాని సమీప ప్రదేశము చూ, స్థానము 1, 10. అడవి. చూ, విపినము, 11 కంటిరెప్పలు చూ, బిడాలము. 2, 12 ఒకానొక దేశము చూ, దేశము.

కచ్ఛరుహా. సం. వి ఆ. స్త్రీ. దూర్వ, గఱిక* చూ, తృణము. 1.

కచ్ఛఘ్ని సం. వి. ఈ స్త్రీ 1. చేఁతిపాట్లు* చూ, పాట్లు, 2 శాబ్రివణి* చూ, బోడతరము.

కచ్ఛదారము. సం వి.అ.పుం. కొండగోనుగు* చూ, మృదుద్రుమము.

కచ్ఛుర సం. వి. ఆ స్త్రీ 1=కచోరము ఒట్టికసింద* చూ, షడ్గ్రంథ, 2 తీఁట కసింద* చూ, సముద్రాంత, 3 బృహతి* చూ, వాఁకుడు.

కచ్ఛురుఁడు సం వి అ పుం 1. ఉపపతి చూ, అంకుమగఁడు, విట 2 గజ్జిలవాఁడు చూ, పామనుఁడు.

కచ్ఛువు సం. వి ఊ. స్త్రీ గజ్జి చూ, విచర్చిక.

కచ్ఛూపతి సం. వి ఈ స్త్రీ. తీఁటకోవెల* చూ, దూలగొండి.

కచ్ఛూరకము సం. వి. అ. పుం.=కచోరము ఒట్టికసింద* చూ, షడ్గ్రంథ

కచ్ఛూరము. సం వి అ. పుం.= —పై —

కచ్ఛోటిక సం. వి. ఆ. స్త్రీ. గోఁచి చూ, బొట్టము.

కచ్ఛోతము. సం. వి. అ. న. 1.=కచోరము. ఒట్టికసింద* చూ, షడ్గ్రంథ; 2. నల్లతిగస* చూ, [illegible]

కజకము. సం వి. అ. పుం. క్రముక* చూ, పోఁక

కజజుఁడు సం. వి. అ పుం. బ్రహ్మ, కమలభవుఁడు చూ, బ్రహ్మ. 1.

కజము. సం. వి. అ న. కమలము, నీరుపుట్టువు చూ, పద్మము. 1.

కజాతజుఁడు సం వి. అ. పుం బ్రహ్మ. చూ, బ్రహ్మ. 1.

కజాతుఁడు. సం వి. అ. పుం —పై.—

కజుఁడు సం. వి. అ పుం బ్రహ్మపుత్త్రుఁడు కపుత్త్రుఁడు, కసుతుఁడు

కజోత్థుఁడు సం వి. అ పుం. బ్రహ్మ చూ, బ్రహ్మ 1

కజ్జలజలన్యాయము పా కోఁటుకలో నీళ్లుపోసి నూఱినవీళ్లు నల్లబడవు, కాటుక కరఁగును అనురీతి.

కజ్జలధ్వజము సం. వి అ. పుం. దివ్వె చూ స్నేహాశము

కజ్జలము సం వి అ పుం 1. మబ్బు చూ, మేఘము 1, న 2 కాటుక చూ, చాఁగు; 3 చీఁకటి చూ, మేచకము. 1, 4. కంసకము చూ, బంతి ఠి.

కజ్జలి. సం వి ఈ స్త్రీ 1 ఒకానొక చేఁప చూ, మత్స్యము 1

కజ్జా. వా డెగడము చూ, యుద్ధము.

కజ్జాకోరు. వా. పేచీకోరు."వాఁడు కజ్జాకోరు" (రూ-కజ్యాకోరు.)

కజ్జాయము. వై వి = ఖాద్యమ్. అపూపమను భక్ష్యము, రూ-కజ్జాయము. పాండు. 4, ఆ. 176. చూ, భక్ష్యము.

కజ్జెము వై వి.=ఖాద్యమ్. —పై— భార. ఉద్యో. 8, ఆ. 178.

కజ్జోయము. వై. వి.= —పై.—

కజ్జియము. వై. వి.= —పై.—

కజూరము. వై. వి.=ఖర్జూరమ్. పేరీఁదు * చూ, మధుఖర్జూరిక.
కజ్జీరము. వై. వి.=—వై.— అం, భా. ద్వి. సం. 79. (రూ-కజ్జారము.)
కజ్జారము. వై. వి.= -వై.- య 5, ఆ. 48
కజ్జెము. వై. వి. = ఖాద్యమ్. రూ- కజ్జెము చూ, రూ-కజాయము.
కఝటి. సం. వి ఆ. స్త్రీ. వాయుసమూహము చూ, వాయువు
కఝాటము. సం వి. అ న. తలలగుంపు.
కఝిల్లీరవము. సం వి అ పుం. చెద్దఝిల్లియను జంతువుయొక్క చేప్పుడు చూ, స్వరము.2
కట దే అవ్య. రూ-కటా సంతాపమును దెలుపును. "గీ. కటకట వియోగలోకంబు కట కటపడ" సా 2, ఆ. 176 చూ, సంతాపము. (ఆమ్రేడితమందు కటకట—రూ-కటకటా.)
కటంకట సం. వి. ఆ. స్త్రీ. దారుహరిద్ర * చూ, మ్రానిపసుపు.
కటంకటేరి. సం. వి. ఈ స్త్రీ 1 —వై.—, 2 హరిద్రావర్ణము, పసుపు చూ, వర్ణము 6
కటంగరము సం వి అ పుం 1. ఊఁక. చూ, తుషము, 2 సంకరము, తుక్కు, చెత్త చూ, పెంట. 1, 3 రూ-కడంగరము' గింజపట్టని వడ్లు చూ, ధాన్యము.
కటంపకుఁడు. సం విశ. కూరలు వండెడువాఁడు చూ, శాకకారుఁడు.
కటంబకుఁడు సం. విశ. —వై—
కటంబము. సం వి. అ. పుం. 1. ఒకానొక వాద్యము: చూ, స్వరము. 2, 2. అమ్ము చూ, బాణము 1
కటంభర. సం వి. ఆ. స్త్రీ. 1 ఆఁడేనుఁగు చూ, హస్తి; 2. రూ-కటుంభర కటుక రోహిణి *: చూ, కకులాదని, 3. ప్రసారణి* చూ, లంజెసవరము; 4. తీఁగెబచ్చేలి* చూ, బచ్చేలి, 5 మణిసిల, కొండమీఁది యొకరకము ఎఱ్ఱరాయి చూ, రాయి; 6. కప్ప చూ, మండూకము. 1; 7. సోఁగ*. చూ, స్రవ.
కటంభరము సం. వి. అ పుం 1 చూ, శోనాక *, 2. గనియ *· చూ. శిరీషపత్రి.
కటకట. వై.అవ్య. వి.=కష్టకష్ట.1. సంతాపము నందలి ధ్వన్యనుకరణము· చూ, హా హా. (రూ-కటాకటా.), వి. 2. కొఱకుటయందగు ధ్వన్యనుకరణము. చూ, హా హా.
కటకటంబడు. ద్వ. అ క్రి (కటకట + పడు) 1 కోపించు భార విరా 5, ఆ. 250 చూ, రోషించు, 2 గాసిల్లు. భార ద్రోణ. 2, ఆ 335 చూ, బాధపడు
కటకటా వై.అవ్య, వి =కష్టకష్ట చూ, రూ-కటకట. 1.
కటకటాకమ్ములు. దే వి. బ ఇనుపకమ్ములు లోనగువానిచే చేర్చఁబెడి యడ్డు కటకటాలు
కటకటాలు దే వి బ —వై.—
కటకము సం వి అ పుం న. 1 కడియము హస్తభూష చూ, భూషణము.2, 2 కొండనడుము, తటము చూ, చేతియ, 3 ఏనుఁగు కొమ్ము నకువేసెడు పొన్ను చూ, పొన్ను 1, 4. రాజు నివసించు ప్రధాననగరము, రాచవీడు చూ, దేశము, 5. సముద్రలవణము చూ, లవణము 1, 6. దండు చూ, సేన. 1, 7. కుంకుడు *: చూ, ఫేనిలము 2, 8. నితంబము: చూ, పిఱ్ఱ.
కటకరము వై. వి =గంధర్వః ఒంటెపిల్ల అం, భా. ద్వి. సం 85 చూ, లొట్టిపిట్ట
కటకవర్ధమానము. అం. సంయుత హస్తములు

ముప్పదిరెండింటిలో నొకటి: చూ, సంయుత హస్తములు.

కటకసరులు. దే. వి. బ. ఒకరకము వడ్లు. చూ, ధాన్యము.

కటకాముఖము సం. వి. అ పుం. 1. అభినయ హస్తవిశేషము, జిట్టన నడిమివ్రేళ్ళ సంమన బొట్టనవ్రేలు చొప్పించి అఱచేతిచాయ వాల్చి ఉంగరపువ్రేలిని చిటికెనవ్రేలిని కొం చెమువంచి పాడవుగాఁబట్టినది. చూ, వ్యంజకము. 1

కటకారుఁడు. సం వి అ పుం 1. పేఁపల్లు వాఁడు చూ మేదరి, 2 మేదరవాఁడు చూ, మేదరి

కటకి సం వి న్. పుం. కొండ చూ, పర్వతము.

కటకోలము సం వి. అ పుం పీఁకదాను చూ. పాత్రము 6

కటఖాదకము సం వి అ పుం 1. గాజుగిన్నె చూ, పాత్రము 6, 2 కాకి చూ, వాయసము, 3. జంబుకము చూ, నక్క.

కటఖాదకుఁడు సం వి అ పుం. తిండిపోతు చూ, భక్షకుఁడు

కటచ్ఛదము సం వి అ పుం. గగ్గెర * చూ, పర్ణాసము

కటచెట దే వి ఒగయుటయుందగు ధ్వన్యను కరణము "ద్వ కరినోయదంష్ట్రలు కటచెట నొరయ" భాగ 7 స్కం చూ, ఝూాళా

కటపురవము. సం వి. అ, పుం. 1 జూదమాడెడు అడ్డపాళ్ళు చూ, పాచిక, 2. ధనము చూ , విత్తము 1.

కటపురుఁడు సం. వి. ఉ. పుం 1 ముక్కంటి చూ, శివుఁడు, 2. విద్యాధరుఁడు చూ, ఘాంసుఁడు, 3. రక్కసుఁడు. చూ, రాక్షసుఁడు. 1.

కటభంగము. సం. వి. అ. పుం. 1. హస్తపరిమా ణముగాఁ బైరుకోయుట, 2 రాజనకు నాశము. 3. సొంతి చూ, శుంఠి

కటభి సం. వి. ఇ స్త్రీ 1 జ్యోతిష్మతి *: చూ, మాసేరు, 2 ఇల్లింద *: చూ, మాతులుంగము ఈ స్త్రీ. 3. నల్లఅగిసె *: చూ, శుకనాసము. 1.

కటమాలిని సం వి ఈ. స్త్రీ కుబేరుని కూఁతురు, మదిర చూ, పుత్రిక. 1.

కటము. సం. వి అ పుం 1. ఏనుఁగుచెక్కిలి చూ, హస్తి (కరటము కటిలనియు పేళ్లు); 2 క్రిందఁ బఱచుకొనెడు తాటి, ఈఁత, వెదురు లోనగువానితో అల్లఁబడిన చాఁప చూ, సాఁప, 3 అతిశయము చూ, హెచ్చు 2, 4 నుఁగు చూ, శవము; 5, పట్టుదల చూ, ప్రతిజ్ఞ 1 6 నడుము క్రింది తొడలమీఁది భాగము, కటి చూ, మొల, 7. వల్లకాడు చూ, శ్మశానము, 8 మాఁకటిమూఁక చూ, ధ్వాంక్షరాజము, 9 ఒట్టు చూ, శపథము, 10 సాగుణము, చూ, సమయము 1, 11 గఱిగ చూ. పార్శ్వము 2, 12. ఏనుఁగుదంతి యిల నేమి చోటు చూ, శంఖము 2.

కటవర్ణుఁడు. సం వి అ పుం భీముఁడు చూ వృకోదరుఁడు

కటశర్కర. సం వి. ఆ. స్త్రీ 1 ముత్తెము చూ, గర్భము. 1, 2. గాంగేష్ఠి * చూ, ముత్తెపుతీఁగ

కటా వై అవ్య=కష్ట చూ, చూ-కట.

కటాంతరము. సం. వి అ. న. మఱియొకచాఁప

కటాకటి. వా. సందేహము.

కటాకువు. సం. వి ఉ. పుం. పక్కి: చూ, పక్షి.

కటాక్షము సం. వి. అ. పుం. 1. మెల్లకన్ను, కడకంటిచూపు, కేకరము: చూ, నేత్రము. 1; 2. కేకరము, కడకన్ను, కోగన్ను: చూ, నేత్రము. 1.

కటాక్షించు. సం. అ క్రి. కడకంటఁజూచు. చూ, చూపు

కటాదము. సం. వి. అ. పుం దున్నపోతు: చూ, మహిషము.

కటాయసము. సం. వి. అ. న జొరుగడ్డి * చూ, తృణము. 1.

కటారి. వై. వి. 1 = కఠారః. రూ- కటారు. "వ. కలకలనవ్వుచుఁ గటారి జరినదూసి ...దుమించె." ఉ, రా 7, ఆ. 211: చూ, రిష్టి. 2; 2 = కఠారః. రూ-కటారు బాఁకు "కలికిమిటారి యంగజుకటారి" కళాం. 4, ఆ. 50: చూ, బాణము 1, అం 3 ఆయుధములు ముప్పదిరెండింటిలో నొకటి. చూ, ముప్పదిరెండాయుధములు. (చూ, బాణము)

కటారికత్తియ వై విశే రూ- కటారికత్తె. "ఒక్కొక్కతతటించుపు బోండ్లు కటారికత్తియల్." కళా. 1, ఆ 81 చూ, స్త్రీ.

కటారికత్తె వై. విశే.—పై.—

కటారికాఁడు వై విశే అసికుఁడు, కటారిగలవాఁడు "వ బిగువు కటారికాండ్రు పరభీకర సత్త్వులు వారలిద్దఱుం లోహితశంక నొందఁగఁ" కళా. 8, ఆ. 100. చూ, ఖడ్గి

కటారు వై ౨ = కఠారః. ఖడ్గము చూ రూ- కటారి (ఖడ్గము — "ఎ భర్తృయుక్, శర ముకటేసి త్రెళ్ళకవెసన్ని గుడక్ సఱకెంగటారుసక్" 416, గీ. చొచ్చి గొలఁకుసెలకు, మూఁకుపైమూఁకఁడనుచు కటారుఁబోలి," ఉ, రా 7, ఆ. 451)

కటారుఁడు సం. వి అ. పుం. 1 వైజ్ఞానికుఁడు, నేర్పరి చూ, సమర్థుఁడు, 2 స్త్రీలోలుఁడు చూ, వలపుకాఁడు.

కటావర్తి. అం. అశుభావర్తములలో నొకటి చూ, అశుభావర్తములు.

కటాహము సం. వి. అ. పుం. 1. కడవ, బాన చూ, పాత్రము. 6, 2 కప్పెర చూ, పాత్రము. 6, 3 తాఁబేటివెన్నుచిప్ప చూ, చిప్ప. 8; 4 ఒకానొకదీవి: చూ లంక 1; 5. అప్పుడే కొమ్ములుచూపెడి ఎనుపదూడ, ఆఁబడ్డ చూ, వత్సము. 2, 6. పప్పు చూ, సూపము, న. 7 పాములవాని తంత్రము.

కటి సం వి ఇ స్త్రీ 1. కటీరము చూ, మొల, ఈ. స్త్రీ. 2 పిప్పలిమోడి *. చూ, పిప్పలి, ఇ. స్త్రీ 3 మేఁకలనుగోయుతావు చూ, స్థానము. 1, న్ పుం 4. ఏనుఁగు చూ, హస్తి; ఈ. స్త్రీ 5. ఏనుఁగుచెక్కిలి చూ, హస్తి, అం 6 సాముద్రిక శాస్త్రమునందలి పురుష లక్షణాంగములు ఏఁబదియెనిమిదింటిలో నొకటి. (పిఱుదు) — సింహ, అశ్వ, వ్యాఘ్ర, వృకసమమై మాంసముగలిగిబలిసియున్న భూపాలుఁడగు, విశాలమై నునుపుగలిగిన బహుపుత్రవంతుఁడగు, వాసరసమము శోభాహీనము చూ, లక్షణాంగములు, 7. స్త్రీలక్షణాంగములు ఏఁబదియెనిమిదింటిలో నొకటి. (మచ్చయు స్నవృద్ధిపదము, కుడిసుడియున్న పతివ్రతయగు, ఎడమసుడియున్న జారయగు విశాలమైన ధనవతియు, పుత్రవతియునగు. విస్తృతమైన పూజ్యురాలగు ఉన్నతమై బలిసియున్న పుత్రవతియగు. వ్రేలాడుచున్న విధవయగు దీర్ఘరోమములున్న దరిద్రురాలగు చూ, స్త్రీ లక్షణాంగములు 8 గాంధర్వవేదములోని భావాధ్యాయప్రమేయమునందలి మధ్యమక్షేత్రములయిదింటిలో నొకటి: చూ, మధ్యమక్షేత్రములు, 9. గాంధర్వవేదమునందలి భావాధ్యాయ ప్రమేయములోని హస్తక్షేత్రములు పదుమూఁడింటిలో నొకటి చూ హస్తక్షేత్రములు

కటిక. సం. వి. ఆ. స్త్రీ. 1. బెత్తముచేతను నాలుపోఁగులచేతను చేయఁబడిన కేడెము: చూ, హారిగ, వై. వి. (1) రూ-కట్టిక-కటికవాఁడు-కటికవాఁడు. వెండిబెత్తమువాఁడు. కళా. 7, అ. 69: చూ, వేత్రహస్తుఁడు, (2)=ఖట్టికః. రూ-కట్టిక. కసాయి. "గీ. కటికవానిల్లు నాటికిఁ గస్తు పెట్టు" భల్లా. 1, అ. చూ, సంహారకుఁడు, (3) రూ-కట్టిక మల్ల పరికరములలో నొకటి చూ, మల్లశాస్త్రము.

కటికచీఁకటి ద్వ. వి. పెంజీఁకటి చూ, పేచకము 1.

కటికమెకము. వై వి =ఖడ్గమృగమ్ చూ, శరభము 1

కటికవాఁడు. ద్వ వి 1 రూ-కటిక. వెండిబెత్తమువాఁడు చూ, వేత్రహస్తుఁడు, 2 రూ-కటిక కసాయి చూ, సంహారకుఁడు

కటికి. దే. విణ 1 అధికము "కటికినవ్వు" చూ, హేరాళము, 2 గట్టి "కటికినేల" చూ, బెడిదము, 3 దట్టము. "కటికిచీఁకటి" చూ, సాంద్రము. 2, 4. ?వ చూ, ?? ము. 1; 5. కఠినుఁడు చూ, వ్యాధుఁడు 2 (రూ-కట్టడి-గడుసరి-గొంటరి)

కటికివాఁడు ద్వ వి 1 వెండిబెత్తమువాఁడు. చూ, వేత్రహస్తుఁడు, 2. కసాయి చూ, సంహారకుఁడు.

కటికిక్రియలు. అం వివృత్తము, రేచితము, ఛిన్నము, కంపితము, ఉద్వాహితము (5) (ఇవి గాంధర్వ వేదమునందలి భావాధ్యాయ ప్రమేయములోనివి)

కటిచ్ఛిన్నము. అం. కరణములు నూటయెనిమిదింటిలో నొకటి చూ, కరణములు.

కటిత్రము. సం. వి. అ న. 1. మొలనూలు చూ, భూషణము. 2, 3. సొంతనము; కౌపీనకోశ; చూ, వస్త్రము, 3 మొలను ధరించుబట్ట. చూ, వస్త్రము.

కటినము. సం. వి. అ. న పుష్పపత్రఫలాదులుంచెడు బుట్ట చూ, పాత్రము. 6.

కటినాభి విమర్దనము. సం. వి. అ. న. బాహ్యరతులలో నొకటి: చూ, రతిబంధము.

కటిని సం. వి. ఈ. స్త్రీ గవాదని *. చూ, పెద్దపాఁపర.

కటిప్రదక్షిణావర్తము. సం. వి. అ. పుం. పాతివ్రత్యలక్షణము చూ, లక్షణము. 1.

కటిప్రోథము సం. వి. అ. పుం. పిఱుఁదుల యున్నతి చూ, పిఱ్ఱ

కటిఫలము. సం వి అ న. తర్కారిఫల *. చూ, తర్కారిబుట్లు.

కటిమచ్ఛము సం వి. అ పుం. వృద్ధిప్రదలక్షణము చూ. లక్షణము 1.

కటిభ్రాంతము, అం కరణములు నూటయెనిమిదింటిలో నొకటి చూ, కరణములు

కటిమాలము సం వి అ పుం అప్రియార్గవము * చూ, ముల్లంగి

కటిల్లకము సం ? అ పుం. 1 కప్ప చూ, మండూకము 1, 2 కాకరవేల్లము * చూ, కాఁకర, 3 వల్లిగ్గెర *. చూ, పర్ణాసము, 4 గలిజేరు * చూ, వర్షకేతువు

కటివామావర్తము సం. వి. అ పుం జారిణీ లక్షణము చూ, లక్షణము 1.

కటిశృంఖల సం. వి ఆ. స్త్రీ. నడుమునకుఁ గట్టు గొలుసు చూ, మొలత్రాడు

కటిసూత్రము సం. వి అ న పురుషుని మొల త్రాడు చూ, మొలత్రాడు

కటిస్నానము. పా (హిప్ బేత్) కూర్చుండి గాదు కనిపెట్టిన తొట్టియందలిస్నానవిశేషము.

కటీతలము. సం. వి. అ. పుం. బాఁకు: చూ, బాణము. 1.

కటీరకము సం. వి. అ పుం నితంబము. చూ, పిఱ్ఱ.

కటీరము. సం వి అ పుం కటి. "సీ. పట్టుసూత్రమయంబు పసిఁడి యొడ్డాణమే యిగురుఁ బోఁడి కటీరమెక్కెనో కొక్క" కాశీ 4, ఆ 108: చూ, మొల.

కటీసమము. అం. కరణములు నూటయెనిమిదింటిలో నొకటి. చూ, కరణములు

కటుంటుకుడు. సం వి. అ. పుం. 1. నీచుఁడు చూ, హీనుఁడు; 2. దీనుఁడు చూ, బీదవాఁడు

కటుంబర సం వి ఆ. స్త్రీ కటుకరోహిణి* చూ, శకులాదని. (రూ-కటుంభర.)

కటుంబరము సం వి అ పుం 1 గొంతెమ గోరు* చూ, లంజెసవరము, 2. ఆఁడేనుఁగు చూ, హస్తి.

కటుంభర సం వి. ఆ. స్త్రీ: చూ, రూ-కటుంబర *.

కటుక, సం. వి. అ స్త్రీ. 1 —వై.—, 2 సన్నఏలకి* చూ, పత్రల, 3. జీరకము*· చూ, జీలకఱ్ఱ, 4. చేతిఆనుగము * చూ, సొఱ.

కటుకందము సం వి. అ. పుం 1 మునగ * చూ, శిగ్రువు. 1, 2. అల్లము * చూ, శృంగబేరము, 3 లశునము * చూ, వెల్లుల్లి.

కటుకము సం. వి అ. న 1.సొంఠి పిప్పలిమిరియములు: చూ, త్రికటుకము, 2. కటుకరోహిణి * చూ, శకులాదని, 3. అగ్నిమంథని * చూ, వైజయంతి. 4, పుం 4 శణతృణము చూ, తృణము 1.

కటుకరోహిణి. సం, వి ఈ స్త్రీ. అసోగము * చూ, శకులాదని

కటుకవల్లి. సం వి. ఈ స్త్రీ ఖట్వి * చూ, సుకాష్ఠ.

కటుకాలాబువు. సం. వి. ఉ. పుం. కటుతుంబి, చేఁదుగల ఆనబః చూ, సొఱ

కటుకీటకము సం. వి. అ. పుం దోమః చూ, మశకము.

కటుకీఫలము. సం వి అ. న. అగ్నిమంథని * చూ, వైజయంతి. 4.

కటుకుఁడు సం. విశ. (అ ఆ. అ.) నీచుఁడు· చూ, హీనుఁడు.

కటుకోశాతకి సం. వి. ఈ. స్త్రీ. చేఁదిబీఱ*: చూ, బీఱ

కటుక్క దే వి కొఱుకుటయందగు ధ్వన్యనుకరణము చూ, హూహూ.

కటుక్వణము సం వి అ పుం టిట్టిభము చూ, లకుముకి

కటుక్వాణము. సం. వి. అ. పుం —వై.— (రూ- కటుక్వణము.)

కటుగు. వై వి.=ఖాటి రూ-కటువు. పాడె చూ, శవయానము.

కటుగ్రంథి సం. వి. న్. న ఊషణ *· చూ, పిప్పలి

కటుచాతుర్జాతము సం. వి అ న. 1. ఏలకి*· చూ, పత్రిల, 2 పట్ట చూ, తోలు * 3 మరీచాత్మక చతుష్కము.

కటుతిక్తకము సం వి అ. పుం జెనుము *: చూ, శణము

కటుతిక్తిక సం వి ఆ స్త్రీ చేఁదుఆనబ * చూ, సొఱ.

కటుతుండి. సం వి ఈ. స్త్రీ. ఒకరకముతీఁగె· చూ, లత 1.

కటుతుంబి సం వి ఈ స్త్రీ చేఁదుఆనబ * చూ, సొఱ

కటుత్వము సం వి. అ న కాటవము చూ, కాటుకము.

కటుత్రియము. సం. వి. అ న. సొంఠి పిప్పలి మిరియములు చూ, త్రికటుకము

కటుదళ. సం. వి. ఆ. స్త్రీ. కర్కటి, నక్క దోస * చూ, దోస.

కటునిష్పావము. సం. వి. అ పుం గింజపట్టని ధాన్యము, పొల్లు: చూ, ధాన్యము.

కటుపత్రము సం వి. అ. పుం. 1. పాపట * చూ, వృకధూమకము, 2. తెల్లతొళసి *: చూ, తులసి.

కటుపత్రిక. సం వి ఆ స్త్రీ. ఒకరకముచెట్టు. చూ, వృక్షము.

కటుఫల. సం. వి. ఆ స్త్రీ లింగిదొండ *: చూ, దొండ

కటుఫలము. సం వి అ. పుం. 1 చేఁదిపొట్ల* చూ, పొట్ల, 2. త్రికంటకము * చూ, పల్లేరు, 3. బొబ్బరి * చూ, శాకపుష్పము

కటుబీజ. సం వి. ఆ స్త్రీ. పిప్పలితీఁగె * చూ, పిప్పలి

కటుభంగము. సం వి అ. పుం. 1 సొంటి * చూ, శుంఠి, 2 అల్లము* చూ, శృంగిబేరము

కటుభద్రము సం వి అ పుం —పై—

కటుమంజరిక. సం. వి ఆ స్త్రీ. ఉత్తరేను * చూ, శైఖరికము

కటుమరలు దే. వి బ హనువు, బుగ్గ "సీ తళుకుఁజెక్కులు కటుమరల్ పెనుపునొందె" చంద్రా 1, ఆ. 98 చూ, పార్శ్వము. 2 (రూ-కటుమర్లు)

కటుమోదము సం. వి అ. న. జవాది మొదలగు సుగంధద్రవ్యము చూ, సుగంధద్రవ్యము.

కటురము. సం. వి. అ. న. తక్రము. చూ, మజ్జిగ.

కటురవము. సం. వి. అ. పుం. కప్ప: చూ, మండూకము.

కటురోహిణి సం వి. ఈ. స్త్రీ. 1. చూ, రూ- కటుకరోహిణి * 2. తక్కెడ *: చూ, వైజయంతి. 4

కటువార్తాకి. సం వి. ఈ. స్త్రీ తెల్లవాఁకుడు *: చూ, వాఁకుడు.

కటువు. సం. వి. ఉ. స్త్రీ 1. కటుకరోహిణి* చూ, కటులాదని, 2. రాజిక, నల్లావాలు *: చూ, సర్షపము, 3. అంకోలగిరి * చూ, ప్రేంకణము, 4 కానిపని చూ, వ్యలీకము.2: ఉ పుం. 5 ఒజ్జ చూ, కారము. 1, 6. గంధము చూ, వాసన 1, 7. చేఁదు చూ, తిక్తము, 8 చేఁదిపొట్ల * చూ, పొట్ల, 9.లవణధర్మము (తె. ప) —ఉప్పఁదనము, ఉవ్వ, విశే. 10 ఇంపుకానిది, 11 కారముగలది, 12 మత్సరము గలది, 13 వాఁడిమి గలది చూ, తీక్ష్ణము, 14 వాసనగలది, పై. వి (1)—ఖాటి పాడె చూ, శవయానము

కటుశృంగాలము సం వి అ న అగ్నిమంథము* చూ, నెల్లి

కటుస్నేహము సం వి అ. పుం నల్లావాలు* చూ, సర్షపము.

కటూత్కటకము సం వి అ న. 1. సొంటి* చూ, శుంఠి, 2 అల్లము * చూ, శృంగిబేరము

కటూత్కము. సం. వి. అ న. —పై—

కటేరకము. సం. వి. అ పుం. కలింజకము చూ, చాప

కటోలము. సం. వి. అ పుం. చేఁదిపొట్ల *: చూ, పొట్ల

కటోలవీణ. సం వి. ఆ. స్త్రీ. మాలవీణె: చూ, వీణె.

కట్ట. దే. వి. 1. అడ్డకట్ట: చూ, సేతువు. 1. 2. చెఱువులోనగు వానికట్ట: చూ, సేతువు.1

వై. అవ్య. కి.=కష్ట. సంతాపార్థకము చూ, సంతాపము. (రూ- కట్టా)

కట్టకడ. దే వి. (కడ + కడ) చిట్టచివర, తుట్ట తుద చూ, సుద. 2

కట్టడ. దే. వి. 1. రూ-కట్టడి ఏర్పాటు. కళా. 7, ఆ. 265. చూ, నియమము, 2 రీతి నిర్వ 10, ఆ. 120 చూ, విధము 1, 3. దేవతా కార్యనియమము, 4. ఆజ్ఞ చూ, సెలవు; 5. గౌరవము. చూ, మర్యాద

కట్టడచేయు. దే. స క్రి. ఆజ్ఞాపించు. "మ జననీభూపతి . ననుంగట్టడచేసె." జై. 2, ఆ 107 చూ, సెలవిచ్చు.

కట్టడి దే. వి 1. రూ-కట్టడ. ఏర్పాటు చూ, నియమము. 2. కఠినుఁడు చూ, వ్యాధుఁడు.2, 3. కఠినురాలు

కట్టనము. దే. వి. 1. కట్టుఁగోక ఆం, భా. ద్వి మ 151. చూ, వస్త్రము, 2 రూ-కట్నము కానుక. "సీ. గాండీవికిని మేలుక ట్టనంబులమర్చి." జై 7, ఆ చూ, లంచము, 3 కట్టు. "ఉక్కుటులులరొకట్టనపు పెడల్ గైకొని నఱకుట" హరి ఉ. 2, ఆ 1. 6 చూ, బంధము. 1.

కట్టపుట్టచెండ్లు ద్వ. వి. బ. బాలక్రీడలలో నొకటి చూ, బాలక్రీడ

కట్టరము. సం వి అ. పుం 1 అడుసు చూ, బురద, వై వి (1) రూ-కట్టారము. నాట్య బంధము ఆం, భా ప్రి. నాట్య 130 చూ, నాటకము. 1.

కట్టా వై అవ్య =కష్ట చూ, రూ- కట్ట.

కట్టాణి దే. వి ఒకానొక మౌక్తికము. "కట్టా ణిగుండ్లు." చూ, రత్నము 1

కట్టాణిగుండ్లు. ద్వ వి. బ. మెడనగ చూ, భూషణము. 2.

కట్టాయితము. దే. వి. అయిత్తము చూ, యత్నము.

కట్టారము. దే వి. నాట్యబంధము. రూ-కట్ట రము చూ, నాటకము. 1

కట్టావరదరాజేంద్రకవి పా. ఇతని గ్రంథము శ్రీరంగమాహాత్మ్యము. (17. శ.)

కట్టావి. ద్వ. వి మిక్కిలివేఁడిమి చూ, వేఁడిమి.

కట్టిఁడి. దే. విశ. (కట్టు + ఇఁడి) క్రూరుఁడు. పాండు. 5, ఆ. 75. చూ, వ్యాధుఁడు. 2.

కట్టిక వై వి =ఖట్టిక: చూ, రూ- కటిక.(రూ- కట్టికము.)

కట్టిపడుపుట జా. (పాపమును) అనుభవింపఁజే యుట, "నాపాపఫలముతోడనె కట్టిపడిపి నది." (నీతిచంద్రిక-విగ్రహము)

కట్టియ. వై. వి. 1.= కాష్ఠమ్. రూ- కట్టె చూ, వంటచెఱకు, 2 రూ- కట్టె. దుడ్డుకఱ్ఱ "క కట్టియఁజేకొని డేగంబట్టి బులుగుల్." స్వా 4, ఆ, 24; చూ, వేత్రము.1, 3.రూ-కట్టె అమ్ము "ఉ. కట్టియవైచె నెన్నుమరు గాఁడ . నరునిఁగప్పిరి శక్తులఁదోమరంబు లన్" భార శల్య 1, ఆ. 377 చూ, బాణము. 1, పా 4. తూనికతూఁచు రాళ్ళు: రూ- కట్టె

కట్టు దే వి 1 చోటు, కాశీ. 6, ఆ, 262. (ఇట్లు చేనుకట్టు లోనగునవి.) చూ, స్థానము 1, 2 తొట్టికట్టు. చూ, ముంగిలి. 2, 3 గింజపట్టని వడ్లు. చూ, ధాన్యము, 4. గింజపట్టని వడ్లరాసి "గీ సామర కళ్లాన శూర్పవాతఘుట్టనలఁ బాఱు పెనుఁబొల్ల కట్టు వోలె." అము 4, ఆ 13 చూ, ధాన్యము, 5. కట్టుచోరు, చూ, యూషము, 6. కట్టనము చూ, బంధము. 1, 7. బట్టకట్టు కొనుట. 8 కట్టుపాటు చూ, బంధము. 1, 9. కదలమెదలఁగూడని కట్టు: చూ, బలవంతము, 10. గడువు. య. 3, ఆ. 101; చూ,

మితి, 11. పద్యముల అంత్యాక్షరము లంటు కొనుచు పద్యములను చేయుట. "కట్టుపద్యములు.", అ.క్రి 12. (ఆవులోనగునది) గర్భము ధరించు, 13 కట్టఁబడినదగు. "కట్టువిణ్యాశ్రిత్రములు." మార్క 2 ఆ 34 (అంచెలుగట్టు, అంటులుగట్టు, అట్టుకట్టు, కరుడుకట్టు, కాలువలుకట్టు, గెలలుకట్టు ఇత్యాదులందిలి అగు ధాత్వర్థకమగు) చూ, సంధించు, 14. కట్టువేయు చూ, బంధించు, 15 ఆరోపించు. "క. దోషరహితకన్యక పై, దోషంబులుగట్టి రిత్తదూషించిన" విజ్ఞా. ఆచా, కాం. 108 చూ, పొదవెట్టు, 16 సేకరించు. భార. ఆది. 5, ఆ. 58 చూ, సంగ్రహించు, 17 తయారుచేయు. "ఇల్లుకట్టు." చూ, నిర్మించు, 18 బట్టకట్టుకొను "సీ కట్టంగఁదొడఁబుయ్యఁబెట్టఁ గొఅంతలే కొనందుచుండెడు నర్థులందు" నిర్వ 1, ఆ. 38, 19 (పదరంగమునందు) ఆటనుకట్టు. "తోసిరాజు ఆట కట్టు.", 20 గట్టిపడు. "పప్పు ముద్దకట్టు", 21 ఒకదానితో నింకొకటి అంటలీయు "పందిరిరాటలకు వెదుళ్లుకట్టు", 22. ఆలుమగలనుకలుపు "భార్యాభర్తలకట్టు ఇప్పటికి కుదిరినది", 23 మాటలపొంగు "వాక్యముల కట్టు సరసముగానున్నది" ఇత్యాది

కట్టుఁగంబము ద్వ. వి (కట్టు + కంబము) ఏనుఁగు లోనగువానిఁ గట్టునట్టి కంబము. "గీ కట్టుఁగంబంబు విఱుచు నుగ్రంపుగజము" హరి. పూ. 9, ఆ. 50, "వ. పసపార్చికట్టుఁగంబంబులకుందార్చి బంధించిన" (ఇక్కడ కుక్కను గట్టునట్టి కంబము) స్వా. 4, ఆ. 27, చూ, స్తంభము. 1.

కట్టుఁగొంగు. ద్వ వి. (కట్టు + కొంగు) కోక యొక్క కట్టుకొనుచెఱఁగు: చూ, చెంగు.

కట్టుఁగొయ్య. ద్వ. వి. (కట్టు + కొయ్య) నాఁగటిమంప వెనుక నిలిపినకొయ్య. చూ, మేఁడితోఁక.

కట్టుఁగొమ్మ. ద్వ. వి. (కట్టు + కొమ్మ) అడ్డకట్ట: చూ, సేతువు. 1.

కట్టుఁగోళ్లు. ద్వ వి —పై—

కట్టుఁగోక. ద్వ. వి. (కట్టు + కోక) అధోంశుకము, కట్టుబట్ట చూ, వస్త్రము.

కట్టుక. దే వి. 1. గర్భస్రావము, రూ-కట్టుగ. కడుపులోని పిండాదులు బయటికి వచ్చుట. (కాఱుట, చూ, ప్రసవము. 6; 2 పశుగర్భస్రావము, రూ-కట్టుగ. చూ, ప్రసవము, 6.

కట్టుకావలి ద్వ. వి కప్పము నొసంగువాఁడు అరిగాఁపు.

కట్టుకాసులపేరు. పా మెడనుధరించు కాసుల దండ చూ, భూషణము 2.

కట్టుగ దే వి చూ, రూ- కట్టుక

కట్టుగడ దే విణ (చేర్చిపెట్టి) ధాన్యము చూ, ధాన్యము

కట్టుగొఱ్ఱు. దే వి (కట్టు + గొఱ్ఱు) మేథి, పసులనుగట్టుటకు కళ్ళమునఁబాఁతిన గుంజ చూ, స్తంభము 1

కట్టుగేరు ద్వ వి గేరు చూ, యూపము

కట్టుట దే వి కట్టు చూ, బంధము. 1

కట్టుదిట్టము దే వి చూ, కట్టుపాటు 1 (వా)

కట్టుదొన ద్వ వి కోనేఱు, పుష్కరిణి "సీ. ఇం చరిత్రావృతమునకు ముఖ్యముల జనుల వీనులు కట్టుదొనలు గాఁగ" చంద్రా 5, ఆ. 147 చూ, సరస్సు 1

కట్టుపకాసి. ద్వ. వి పోటుమగఁడు చూ, వాంఛీరుఁడు. 2.

కట్టుపకాసు దే విణ అచలుఁడు "చ. కనుఁగొని పార్శ్వమండపమున కట్టుపకాసయి... నాతఁడుంగ్రితన్.": చూ, స్థిరుఁడు.

కట్టుపడు. ద్వ. అ. క్రి: చూ, బద్ధుఁడగు.

కట్టుపాటు. ద్వ. వి. 1. కట్టుబడుట: కట్టుదిట్టము, కట్టుబ్బు; 2. కట్టు: చూ, బంధము.1

కట్టుపాటుచేయు. ద్వ. వి. ఆజ్ఞాపించు, నేమించు· చూ, సెలవిచ్చు

కట్టుబండి. ద్వ వి (సకలపరికరసహితమైన) బండి. "ఉ. మొన్న... నేఁ, డేపునఁగట్టుబండి నిదెయిందఱుఁజూడఁగ నింతచేసె" వి, పు. 7, ఆ 120: చూ, శకటము. 1.

కట్టుబట్ట. వా. వి మొలనుచుట్టిన బట్ట. "కట్టుబట్టతో లేచివచ్చితిని.": చూ, వస్త్రము.

కట్టుబడి ద్వ. వి. బంటునకిచ్చెడు మాన్యము. "కట్టుబడి యీనాములు" చంద్రా 4, ఆ. 84 చూ, మాన్యము. 1.

కట్టుమట్టు దే. వి 1. పసులనుగట్టుచోటు. (కట్టుముట్టనివాడుక.), చూ, స్థానము 1, 2. ఉండుచోటు. "సీ పాకారిముఖ్యదిక్పాలక నిలయంబు గ్రహతారకంబుల కట్టుమట్టు." భిల్లా. 3, ఆ. చూ, స్థానము. 1, 3 ఏర్పాటు. "వ. దుష్టనిగ్రహశిష్ట పరిగ్రహంబుగా నప్పట్టణంబు సుగ్రీవాజ్ఞనడవం గట్టుమట్టు చేసి" రామా. 5, ఆ 325 చూ నిజము 2

కట్టుమామిడి ద్వ. వి చిలుకలులోనగునవి కొఱుకకుండ పండ్లుమాసి కట్టఁబడిన మామిడి*· చూ, మామిడి.

కట్టుమ్రాను ద్వ వి. తెప్ప చూ, హోడము

కట్టులేనివాఁడు. ద్వ. వి నియమములేనివాఁడు. ఉద్దాముఁడు

కట్టువ దే వి వృతి అచ్చ. సుం, కాం. 95 చూ, ప్రాచీనము 1

కట్టువర్గము మి. వి ధరించు వస్త్రాదికము. (వా)

కట్టుళ్ళు. వా. వి. బ చూ, కట్టుపాటు 1. "వానిని కట్టుళ్ళలోపెట్టినారు."(బందెకానా అని కొందఱు)

కట్టె వై. వి =కాష్ఠ· చూ, రూ-కట్టియ.

కట్టెగుత్తము. ద్వ. వి. ఒకానొకబాలక్రీడ, ఓం

కట్టెచీమ. ద్వ. వి. పెద్దనల్లచీమః చూ, పిపీలిక.

కట్టెడ. దే. వి. (ఎడనెడకట్లుగలది) కట్లపాము చూ, సర్పము.

కట్టెపొఁపర ద్వ. వి ఒకానొకచెట్టు* చూ, వృక్షము.

కట్టెర దే. వి. పుట్టె చూ, శల్యము. 1.

కట్టెవిఱుపుమాట ద్వ. వి. అతివాదము· చూ, పరుషము. 2.

కట్నము. దే వి. రూ- కట్టనము. కానుక. హరి. పూ. 9, ఆ 16 చూ, లంచము.

కట్వరము. సం. వి అ. పుం. ముద్దపప్పు చూ, సూపము.

కట్ఫల సం. వి ఆ. స్త్రీ. పొఁపరబుడమ *· చూ, శ్రీపర్ణి.

కట్ఫలము. సం వి.అ పుం చూ, పినగుమ్మడు*.

కట్యాశ్లిష్టకము సం. వి అ. న. ఒకరకము కౌఁగిలింత· చూ, సంశ్లేషము.

కట్ల వై. వి. 1 = ఖట్వా రూ- కట్లియ. ఎఱచిపిడుక * చూ, శంకిని, 2. మంచెపు డోలి చూ, పాలకి. (రూ-కట్లి- కట్లే-కట్లె-కట్లమంచెము )

కట్లంక దే వి వయసడ్డలపైనుంచెడి యొంటి గుడ్డ చూ, వస్త్రము

కట్లగుదియ. ద్వ. వి ముసుండి చూ, బాణము 1

కట్లజెఱ్ఱి ద్వ వి. కట్లుగల పెద్దజెఱ్ఱి. చూ, సర్పము.

కట్లదండ ద్వ వి ఎడనెడ బంగారుకట్లుగ్రుచ్చిన నల్లపూసల సరము చూ, భూషణము.2.

కట్లపాము ద్వ వి. కట్లజెఱ్ఱి చూ, సర్పము

కట్లపురుగు ద్వ వి —పై— (రూ- కట్టెడ.)

కట్లబల్ల ద్వ వి. (కట్లు + బల్ల) కత్తెరకాళ్ళ మడుపుబల్ల చూ, మంచెము.

కట్లమంచెము. ద్వ వి మంచెపుడోలి : చూ, పాలకి

కట్లమారి. ద్వ. విశ. కట్లుగలది. చంద్రా. 4, ఆ 127.

కట్లసంచి. దే. వి. (కట్లు + సంచి) చుట్టు అఱలేర్పఱచి కుట్టిన నిడుపాటిగుండుసంచి. చూ, సంచి

కట్లె వై వి. 1.=ఖట్వా. రూ-కట్లె ఎఱచి పిడుక * చూ, శంకిని, 2 కట్లమంచము చూ, పాలకి, 3. బంగారు తూనికగుండు: చూ, పడికట్టు.

కట్లె. వై వి. 1-2-3 -పై.-, 4 కట్లెతీఁగ *. చూ, పర్యంకపాలిక

కట్వా. సం వి. ఆ స్త్రీ కటుకరోహిణి * చూ, కరులాదని.

కట్వాంగము సం. వి. అ పుం. 1 దుండిగము * చూ, శోణకము

కట్వారము. సం. వి. అ. న. 1 నవనీతము. చూ, వెన్న, 2 కూర చూ, వ్యంజనము. 1, 3. లకరము చూ, మజ్జిగ.

కట్యాల్లిక. సం వి ఆ స్త్రీ. జేమ్మి చూ శమి

కట్వి సం వి ఈ స్త్రీ 1. కటుకరోహిణి* చూ, కరులాదని, 2 ఒకగకముతీఁగె * చూ, లత 1

కఠకాలాపుఁడు సం వి అ పుం. కఠమహర్షి చేత అధ్యయనము చేయఁబడిన కాఠకమను శాఖను చదువువాఁడు కఠుఁడు

కఠకుఁడు. సం వి అ. పుం కఠకమహర్షి చూ, ముని. 1

కఠమర్దుఁడు, సం వి. అ. పుం. ముక్కంటి చూ, శివుఁడు.

కఠము. సం.వి అ న. 1. కట్టు: చూ, వేత్రము. 1. పుం, 2. కూఁత చూ, స్వరము. 2; 3.= కఠాణి, బంగారు: చూ, లోహము. 1; 4. వారి స్త్రీ సుఖకమల్లము.

కఠరము సం. విశ. (అ. ఆ. అ ) గట్టి: చూ, బెడిదము.

కఠలము సం. విశ. (అ. ఆ. అ.) —పై.—

కఠవల్లి సం వి. ఈ. స్త్రీ. ఉపనిషత్తులలో నొకటి చూ, ఉపనిషత్తులు.

కఠారము. సం వి. అ. పుం. 1 కత్తి; భీ 1. ఆ. 62; రా ఆర. 1, ఆ. 155. చూ, కృష్టి. 2, 2. బాఁకు, వీర 4, ఆ. 81, "కకఠారంబులఁబొడిచియుఁగుఠారంబుల నఱికియు" రా. యు, కాం 1752. చూ, బాణము. 1.

కఠారి వై.వి.=కఠారి.—పై.—(పుస క.)

కఠాలువు. సం. వి ఉ. పుం.=కఠారి. -పై.-

కఠాహకము. సం వి అ.పుం. కూకుగుండంగి చూ, గాత్యూహము

కఠి సం వి. ఈ. స్త్రీ చిఱుతేకు * చూ, బారంగి

కఠింజరము సం వి అ పుం నల్లగొరు *. చూ, పర్ణాసము

కఠిల్లాడువు సం వి ఉ పుం లశునము చూ, వెల్లుల్లి

కఠిన సం వి. ఆ స్త్రీ 1 ఖంటి చూ, గోళము, 2 గుడము చూ, బెల్లము. 1.

కఠినదండము అం. సప్తవ్యసనములలో నొకటి చూ, సప్తవ్యసనములు

కఠినఫలము. పా అవి దీర్ఘకఠినఫలము (కొబ్బరి పండు లోనగునవి )

కఠినపృష్ఠకము సం. వి. అ పుం. కచ్ఛపము చూ, తాఁబేలు

కఠినము సం. వి. అ. న. 1. వంటకుండ చూ, భాండము. 3, విశ, 2 గట్టి. చూ, బెడిదము, 3. పరుసఁదనము చూ, పరుషము.

కఠినాన్నము. పోఁకచెక్కలు మున్నగునవి తినుటచే మరణించు జాతకుఁడు. పా. జన్మలగ్న కారక లగ్నములకు తృతీయమున చంద్రగుళి

ములతో సంబంధమున్న యెడల నిట్టియోగము సంభవించును

కఠిని. సం. వి. ఈ. స్త్రీ. 1.=కడ్డి పలకమీఁద వ్రాయుపుల్ల చూ, బలపము, 2. చిత్తరువు వ్రాసెడు తూలిక చూ, లేఖిని.

కఠినిక. సం వి అ. స్త్రీ. జేగురుఱాయి చూ, ఱాయి.

కఠినుఁడు సం. విశే. (అ ఆ అ) దుష్టుఁడు చూ, వ్యాధుఁడు 2

కఠినులు, సం. విశే. బ. కఠినాత్ములు చూ, నిర్దయులు.

కఠినోక్తి. సం. వి. ఇ స్త్రీ. అతివాదము చూ, పరుషము 2.

కఠిల్ల, సం వి. అ స్త్రీ. ఎఱ్ఱగలిజేరు* చూ, వర్షకేతువు

కఠిల్లకము సం వి అ. పుం. 1 కాగపెల్లము* చూ, కాఁకర, 2 గలిజేరు* చూ, వర్షకేతువు, 3. తొళసి* చూ, తులసి

కఠిల్లము. సం వి అ. పుం —వై—

కఠిల్లు దే. వి హాతియందగు ధ్వన్యనుకరణము స్కా 4, అ 37. చూ, హాహా

కఠుఁడు సం. వి. అ. పుం చూ, కరకాలాపుఁడు

కఠేరుఁడు సం విశే (అ ఆ. అ.)=కోటిక. మిక్కిలి పిసినిగొట్టు చూ, లోభి

కఠేరువు సం వి. ఉ. పుం సోమరపుగాలి: చూ, వాయువు.

కఠోరము. సం. విశే. (అ ఆ. అ) గట్టి చూ, బెడిదము

కఠోరుఁడు. సం. విశే (అ ఆ అ) పాపాల ముద్ద. చూ, వ్యాధుఁడు. 2

కఠోలము. సం విశే. (అ. ఆ. అ) చూ, రూ-కఠోరము

కఠోలుఁడు సం విశే (అ. ఆ అ.): చూ, కఠోరుఁడు.

కడ. వై. వి 1=కాష్ఠా. దిక్కు. "తే. రెక్కరాయఁడుదమి మీఱరేవెలందిఁ, బెండ్లియగుననికడయను పేరఁటాలు ..మున్నిటఁ గుప్పింకనంత" అచ్చ. అయో, కాం. 12 చూ, హరిత్తు, 2 తావు చూ, స్థానము 1, 3. దప్పి. "వ వెల్లియైన జలపూరంబు పాయయిచ్చుచు .. కడనయుండె." కళా 4, ఆ. 93 చూ, విప్రకృష్టము 4 దగ్గఱ. "క కడునునురక్తియు వివేకశూన్యుల, కడనుండెడు నంతకంటెఁ గష్టము గలదే" ఆము 3, అ చూ, సమీపము, 5. వైపు కళా 7, ఆ. 72 చూ, పార్శ్వము. 2; 6. చివర భార. భీష్మ 1, అ 21; చూ, సుద 2, 7. చావు. "ప్రాణము కడఁబట్టినది." చూ, మరణము, వై.విశే. 8 తక్కువైనది "వ, ఎయ్యదికడగా నిష్కల్మషుండనగుదు" భార. శాంతి. 1, అ 281 చూ, హీనము 1

కడంక దే వి 1 ఉద్రేకము, ఏపు చూ, విజృంభణము, 2. చేవ, ధైర్యము చూ, స్థైర్యము, 3 రూ-కడఁక. ఆయితము చూ, యత్నము, 4 తెంపు చూ, సాహసము

కడంగము సం వి అ పుం ఒకవిధమగు సారాయి. చూ, సుర. 1

కడంగరము. సం. వి. అ. పుం 1. రూ-కటంగరము పొల్లు చూ, ధాన్యము, 2 పొల్లు కసవు చూ, తృణము. 1

కడంగరీయము. సం. వి అ. పుం. పొల్లు కసవు మేసెడి ఎద్దు చూ, వృషభము 1.

కడంజా. దే. వి గోకర్ణమృగము చూ, గోకర్ణము

కడంతి దే వి. ఒంటెపిల్ల. ఆం, భా ద్వి సిం. 85 చూ, లొట్టిపిట్ట. (రూ-కడఁతి.)

కడంబము. సం వి అ. పుం. 1. కలంబము: చూ, కూరనార, 2 అమ్ము. చూ, బాణము. 1.

కడంబి. సం. వి. ఈ. స్త్రీ. బచ్చలికూర *. చూ, బచ్చలి.

కడఁక దే. వి అయితము. విక్రి 3, అ 76. చూ, యత్నము (రూ-కడంక-కణఁక-కదలిక-కదలు)

కడఁగు దే అ క్రి రూ-కణఁగు పూను ఈ, హరి 5, అ 179. చూ, యత్నించు

కడఁజి దే వి. చూ, రూ-కడంజి (రూ-కణఁజి-కణుజు-కడితి-కణితి)

కడఁత దే వి రూ-కణఁత. కంటికడ ప్రక్క చోటు, శిరఃపార్శ్వము. ఆం, భా ద్వి మ. 144 చూ, పార్శ్వము. 2

కడఁతి దే. వి. 1 (తద్భవమని పురుషోత్తమ కవీయము=కణ) గంధర్వమృగము ఆం, భా. ద్వి సిం 85, "పులులందుఱించి కడంతులం దునిమి." శుక 1, అ. 182 చూ, లొట్టిపిట్ట. (ఒంటెపిల్ల అనుట యుక్తము) వై వి 2.= గ్రిష్మ కంతి చూ, దుప్పి,

కడఁబడు ద్వ అ క్రి (కడమ + పడు) క్షయించు. లగ్గు "క హరినూకర రూపంబున, యుం, దరె వారలగౌరవము కడంబడియెనోకో" పంచ వేం 1, అ 176 చూ, సుర్రుక్కు 9

కడక. దే. వి. చూ, కడఁత.

కడకంటిచూపు దే స క్రి 1 కటాక్షించు. చూ, చూపు, 2 (పేరిమతోఁగూడిన) తుట్టతుదచూపు, అవసానకాలమందలి చూపు, క్రియాంతమందలి చూపు; కడసారి చూపు (వా.)

కడకన్ను. ద్వ. వి. కటాక్షము: చూ, నేత్రము 1. (రూ-కడగన్ను-క్రేగన్ను.)

కడకము. సం. వి. అ. న. ఒకానొక ఉప్పు: చూ, లవణము. 1.

కడకు దే వి. కడిమి *. చూ, నీపము. (రూ-కడప-కడమ-కడిమి-కడ్మి)

కడకుఁబోవు ద్వ. అ. క్రి. (కడకున్ + పోవు) కొంగుమాయు చూ, సమర్థాడు.

కడకేక. దే. వి. మరణసమయమున వేయుకేక. చూ, స్వరము. 2.

కడకొఱవి. దే. వి కాలఁగా మిగిలినకట్టె. భార. ఉద్యో. 2 అ 275 హరిశ్చ 2, భా. 2056. చూ, కొఱకచ్చు

కడఁగంటఁజూచుట. వా కటాక్షదృష్టి, దయతోఁగూడిన చూపు. "నిను వాలుం గడగంటఁ జూగుదుననుచుక." (పారిజాతాపహరణము)

కడగండ్లమారి దే. విణ ఆపదలు పొందుటయే స్వభావముగా గలవాఁడు. అగసాట్లపోతు, అగసాట్లమారి- రూ- అగసాట్లమారి, (సం. ప) —ఆర్తిపన్నుఁడు, కష్టశీలుఁడు, కష్టతుఁడు

కడగండ్లు దే. వి బ (కడ + కండ్లు) కష్టము, ఇబ్బంది. చూ, దుఃఖము,

కడగట్టు. ద్వ స క్రి (కడ + కట్టు) వీగ్గడమే హరి పూ 8, అ. 159, పై శిరం. 2, అ 157 చూ, స్పజించు.

కడగన్ను ద్వ వి చూ, రూ-కడకన్ను.

కడగొట్టు ద్వ. అ. క్రి (కడ + కొట్టు) 1 చచ్చు "వ కడ సిన్ గుప్పలు . సింగముల్, కడగొట్టెన్." సా. 1, అ 107. చూ, మరణించు, విణ. 2. కడపటిది. "కడగొట్టు కొడుకు-కడగొట్టు చెల్లెలు.": చూ, వెరసి. 2.

కడచేను. ద్వ. అ. క్రి. 1. చెచ్చు భార శల్య.1. అ. 9: చూ, మరణించు; 2. ముచ్చిమాయు, భార. అను. 1, అ. 19: చూ. పశించు;

3. ముగియు "క. అనఘూయూయజ్ఞము...
గడచేననేరదు భూసురో త్తమ నిమిత్తము
నన్." భార. అది. 2, అ 210 చూ, సరి
పోవు. 3, స క్రి 4 టు. "క వననిధి
నవలీలం గడ, చేసు మర్కటులెల్లన్ "
రా. కిష్కిం, కాం 11: చూ, తరించు.

కడచు దే అ. క్రి 1 చెచ్చు రా. కిష్కిం,
కాం 703 చూ, మరణించు, 2 కడవం
బడు "క చింతింపకు కడచినపనికి": చూ,
గతించు, 3 మచ్చేమాయు చూ, నశించు,
4 అతిక్రమించు "ఎ, గీ ధరణిధరములు
గూలంగ ధరణివడంక, జలధులుప్పొంగి కడ
వంగ." మార్క. 2, అ 13 చూ, దాటు.6,
5 అధిక మగు "క వసిగల్గి హంసగతికిం,
గడవంబఱచువారును " భో. 6, అ 24
చూ, హెచ్చు 3, స, క్రి 6 దాటు.
"గీ, అల .. గంగాతరంగిణిం గడచి."
రామా 5, అ 28 చూ, తరించు

కడ మిక్కి ద్వ. వి రేవతీనక్షత్రము చూ,
నక్షత్రము 1.

కడజాతివాడు. దే వి చండాలుడు, బ్రాహ్మ
ణస్త్రీ శూద్రులకుం బుట్టినవాడు చూ,
మాల (1)

కడతెగు ద్వ. అ. క్రి ముగియు "క ఉడు
మండలంబు,...గడతెగక నాకు దాటి
పోరాదయ్యెన్." మై 2, అ చూ,
సరిపోవు. 3

కడతేఱు. ద్వ అ క్రి 1 చెచ్చు (రూ-కడ
గొట్టు-కడచేను-కడచు ) అచ్చు రా సుం,
కాం. 123 చూ, మరణించు, 2 తీఱు.
"అట్లుకాదే విరహజ్వరంబు కడతేఱునె "
భో. 3, అ 249 చూ, నశించు, 3. సమా
ప్తమగు, ముగియు "సీ ధ్రువమండలంబు
నరుంధతి గనుశక్తి కంటికిం గలుగంగ .
నాయువు సంవత్సరంబునం గడతేఱు రాజ
ముఖ్య " భార. శాం 6, అ. 126. చూ,
సరిపోవు. 3, 4. కడచు అం, భా. త్ర.
శాం 94 చూ, గతించు

కడత్రము. సం వి. అ. న 1 ఒకరకము
పాత్రము చూ, పాత్రము. 6, 2. పెం
డ్లాము. రూ-కళత్రము చూ, భార్య

కడదెసంగాచెడిరా దే వి. ఈశానదిక్పతి,
ముక్కంటి అం పదా. సుర. 37 చూ,
శివుడు

కడప దే. వి. 1. రూ-గడప. చూ, దేహళి
(ఇట్లు పరుషాదిగా కొందఱు), వై వి. 2=
కదంబము* చూ, నీపము, (రూ-కడిమి )

కడపటు దే వి అగ్రము చూ, మొదలు 2

కడపటిమల దే వి. చక్రవాళపర్వతము: చూ,
పర్వతము.

కడపల. వై వి తుద. "ఎ, గీ ఏదిమొదలేది
కడపల యేదిమధ్యము." భీ 6, అ. 75,
నిర్వ 8, అ 73 చూ, తుద.2. (రూ-కడ.)

కడపు దే ప్రే 1 ఇయ్యాకపొమ్మను "ఏపట్టున
నరులం గడప "భో 3, అ 137, భార అర 5,
అ 13, 2 చంపు హరిశ్చ. 5, అ 112.
చూ, మరణించు, 3 బండ్లు పసులు లోనగు
వాని నడపించు "అరదంబుదారకుండు
గడపు " ఉ. హరి 4. అ. 214 చూ,
వెలుచు, 4 వదలు. భార ఉద్యో 4, అ.70,
భార. స్త్రీ. 1, అ. 25 చూ, విసర్జించు.

కడపుచేయి దే వి (కడపు + చేయి) అరిత్ర
ము, మీకొను. పా 1, అ. 24. చూ
పీలి 2

కడమ దే వి 1 కొఱంత. "క. కడమ యొకిం
తయునులదని " హరి ఉ 3, అ. 168 చూ,
వెలితి 2, 2 అన్యము. చూ, పరాయి,
3 మిగులు "క. మొదలనె ..నడ, పెదం

గడమయుఁబడుచు నిమ్మ పేరిమదలిర్పఁ" పర 4, ఆ. 140 చూ, శేషము. 1

కడమపడు. ద్వ. అ. క్రి కొఱంతపడు చూ, లోపించు (రూ-కీడుపడు-కీడ్పడు.)

కడముంత. ద్వ. వి. కొయ్యవంటి చిన్న మట్టి పాత్రము, రూ-కడుముంత చూ, భాండము. 3.

కడముట్టు ద్వ. అ. క్రి 1. ముగియు. కళా 3. ఆ 180 చూ, సరిపోవు 3; 2 సమకూరు. పాండు. 1, ఆ 208 చూ, సిద్ధించు.

కడయొత్తు ద్వ వి (కడ + ఒత్తు) గృహవిశేషముయొక్క చుట్టుగోడయందలి కంబముల మీఁదిదూలము; తుల చూ, దూలము

కడరాసి. ద్వ. వి మీనరాశి, చేఁపరాసి చూ, రాశి.

కడలి. దే. వి. సంద్రము చూ, సముద్రము

కడలికానుపు. దే. వి. ఈవులమ్రాను చూ, వేలుపుఁజెట్టు

కడలికూఁతురు దే. వి. అబ్ధిజ, లచ్చి చూ, లక్ష్మి

కడలిబత్తిలికదునేదారి దే. వి సముద్రము తూణీరముగాఁ గలవాఁడు, ముక్కంటి. అం పదా. సుర 10 చూ, శివుఁడు.

కడలిమీఁగడముద్ద దే వి చందమామ చూ, చంద్రుఁడు

కడలియల్లుఁడు ద్వ వి వెన్నుఁడు సాంబ దేవ 4 చూ, విష్ణువు 1

కడలిగాతత్తడి దే. వి. నక్రము. మొసలి అం పదా అచర 46 చూ, మత్స్యము 1.

కడలిఱేఁడు. దే వి నీటిరాయఁడు చూ, వరుణుఁడు 1

కడలివెన్న. దే వి. చందురుఁడు. అచ్చ రా. యు, కాం 64 చూ, చంద్రుఁడు

కడలిపెండ్లిఁడి. దే. వి. మిన్నేఱు: చూ, నది.

కడలు. దే. వి 1. అల. హరి, పూ. 9, ఆ. 158 చూ, వీచి. 1; 2. పెద్దఅల చూ, వీచి 1. (రూ-కరండము-కర-కరడు-కరడము.)

కడలుకొను. దే. అ క్రి 1. రూ-కడలొత్తు-కడలుకొను, అతిశయించు: చూ, ముమ్మరించు; 2. రూ-కడలొత్తు మిక్కిలి సంతోషించు, ఉప్పొంగు భార ఉద్యో 3, ఆ. 412. చూ, సంతోషించు, 3. రూ-కడలొత్తు, క్రమ్ము: చూ, వ్యాపించు.

కడలొత్తు. ద్వ అ. క్రి. (కడలు + ఒత్తు) క్రమ్ము. "సీ కరమూలములఁజీఁగి కడలొత్తి." హరి, పూ 8, ఆ. 168 చూ, వ్యాపించు

కడలొత్తు దే అ. క్రి చూ, రూ- కడలుకొను. (వ్యాపించు —"మ. మును...వీఁకం గేసరంబుల్ గడలొత్తు. ఁబొల్పొందెం బెం సంభోజముల్ " భార. ఉద్యో 2, ఆ 110)

కడవ దే వి 1.= కలశము పెద్దకుండ చూ, భాండము 3, 2 =కలశము -కుండ. బిందె గాని పాత్ర చూ, పాత్రము 6 (రూ-కడువ)

కడవఁబడు ద్వ అ క్రి (కడవక్ + పడు) కడతేరు భార ఆది 2, ఆ 222. (స్వర్గమునుపడు) చూ, గతించు

కడవతీటు ద్వ వి రూ-కడువతీటు, తుడుము, మద్దువు చూ, వీణె

కడవరాసి ద్వ వి కుంభరాశి చూ, రాశి 2.

కడవసము. దే వి చర్మము. భార. ఆది 7, ఆ. 227 చూ, తోలు. 1

కడవాఁడు. ద్వ విశ. 1. అన్యుఁడు : చూ, పరాయివాఁడు; 2. అనుజుఁడు. "సీ. గారాపుమీతల్లి కడవాఁడఁగానియే గణుతింపఁ గడవాఁడఁగాజుమయ్య." స్వా. 5, ఆ. 4 చూ, సహోదరుఁడు.

కడవెళ్ళ. ద్వ. క్రి. విశ. అవసానము: చూ, మూలముట్టు.

కడవెళ్ళు. ద్వ అ క్రి 1. ముగియు: చూ, సరిపోవు. 3, స. క్రి. 2. దాటు ప్రిభా. 3, ఆ. 124. చూ, తరించు.

కడసరము. దే. వి ఒకానొకడేగ. రసి. 1, ఆ 115 చూ, శ్యేనము.

కడసారిచూపు. వా. మరణకాలమున చూచెడి చూపు

కడాని దే. వి మేలిమి చూ, లోహము. 1. (తత్స-కర-పురుషోత్తమకవీయము.)

కడారము. సం వి. అ. పుం. 1. గోరోజనము వంటి రంగు చూ, వర్ణము. 6, విణ. 2. గోరోజనమువంటి రంగుగలది చూ, వర్ణము, 6, పుం. 3 ఏనుఁగు కపోలమదము : చూ, మదము. 1.

కడాసము. దే. వి చూ, రూ- కడవసము, ఆం, భా ద్వి. ప్రి. 177.

కడి. దే వి. 1 పసి. అము. 2, అ. 19. చూ, వాసః. 1, 2. కబళము, ముద్ద చూ, సాపాటు, 3 అధముఁడు చూ, హీనుఁడు, 4 గాయము చూ, నరుకు, 5: చూ, పేడ ముద్ద "పేడకడి" (వా)

కడిఁది. దే వి. 1. ఆపద. "క అడి ద్రాగుడ నక యిప్పటికి కడిఁదికి నేమాంసమైన .. గహనములోనక" పంచ. వా 1, ఆ 385 చూ, విపత్తు, 2 =కఠినము కష్టము చూ, దుఃఖము, 3. బీరము (రూ-కడిమి-కడ్మి-కడుదు) ఆం, భా ద్వి తృ 22[1] చూ, శౌర్యము, విణ. 4 క్రొవ్వినది చూ, స్థూలము 2, 5. అధికము. భార. అర. 3, ఆ. 235 చూ, హేరాళము, 6 అశక్యము "అ. అట్టియ స్థంబు విడుచువెవ్విధమునఁ గడిఁదిగాదె" భార అర. 6, ఆ 111 చూ, లావు 7, 7. అందరానిది, చూ, వెక్కసము. 3, 8 కఠినము, కళా. 7, ఆ. 130: చూ, బెడిదము.

కడికండలు. ద్వ. వి. బ. ఖండఖండములు, ముక్కముక్కలు. భార విరా. 5, ఆ 151. చూ, శకలము 4.

కడిగొను దే. అ క్రి. (కడి + కొను) కబళించు. భాగ. 8, స్కం. 246. చూ, మ్రింగు.

కడితము. వై. వి.=ఘుట్టితము, కవిలెకట్టు. ఘుట్టించిన నీలపటుపు లెక్కపొత్తము. పాండు. 5, ఆ. 78. చూ, పుస్తకము.

కడితి దే వి రూ-కణితి, స్వా. 4 అ. 37: చూ, గోకర్ణము.

కడితులము సం. వి. అ పుం. కత్తి: చూ, రిష్టి.2

కడిదలుఁగు దే. వి. చుట్టువాలు, చక్రాయుధము. అంధ్రి. పదా. సుర. 16 చూ, బాణము. 1.

కడిమి దే వి 1, అతిశయము. రూ-కడ్మి. ఉ, రా 5, ఆ. 181, వసు 3, ఆ 185. చూ, హెచ్చు. 2, 2. రూ-కడ్మి అధిక్యము "చ. వెరవున లావునం గడిమి బీరమునం బోలు పొందు రాచదేవర" య 2, అ. 122. చూ, హెచ్చు 2, 3 రూ-కడ్మి పరాక్రమము. అచ్చ. యు, కాం 489: చూ, శౌర్యము 1, వై వి 4.=కదంబ*. చూ, నీపము (దీని భేదములు.—నీరుకడమి, బట్టకడిమి )

కడిమిడి. దే విణ. పచ్చికగలది (నేల) "ఎ. పచ్చనికడిమిడి పట్టునం జటాయువుం దలంచి దర్భపూతంబుగాఁ బిండంబు వెట్టె." రా. అర. 2, ఆ 376 చూ, భూమి 1.

కడియపుటట్టు ద్వ. వి (కడియము + అట్టు) ఒకానొకభక్ష్యము కళా. 7, ఆ 81 చూ, భక్ష్యము.

కడియము. వై. వి. 1.=కటకః. ఒకానొకహస్తభూష. రూ-కడెము చూ, భూషణము 2, దే వి. 3. వరిపిప్ప నూర్పుచేయుచు గడ్డి

కడుపుమంట ద్వ. వి. ఈర్ష్య చూ, నూను. 1.

కడుపూఁద. ద్వ. వి. (కడుపు + ఊఁద) 1. —పై—, 2. జలమలములు కట్టి కడుపుబ్బ రించెడి పశురోగము. "గీ నరిడిపుప్పుకప్ప నా పురుగడు పూఁద,యదరుఁ దిక్కయనఁగ నడ 8" హరి. పూ 6, ఆ 46 చూ, పశురోగము.

కడుపేడు దే. వి. (కడుఁ + పేడు) మేదర వాఁడు కట్టుకట్టెడు సన్నని వెదురుపేడు.

కడుముంత. ద్వ. వి చూ, రూ- కడముంత.

కడువ వై వి.= కటాహ-ఘటము. చూ, రూ- కడవ

కడువతీటు ద్వ వి చూ, రూ-కడవతీటు

కడువరాసి. ద్వ. వి చూ, రూ- కడవగాసి

కడువు. దే అ క్రి రూ- కడుగు చూ, ప్రక్షాళించు.

కడెము. వై వి, దే. వి చూ, రూ- కడియము (తత్స-కటక-పురుషోత్తమకవీయము) (రూ- కడ్యము.)

కడ్గు చూ, రూ- కడుగు (ప్రక్షాళించు.— "అడుగులు కడ్గి" భార. అశ్వ 4, ఆ. 223)

కడ్డాయము దే వి నిర్బంధము చూ, బలవంతము

కడ్డి. వై వి. 1.= ఖటికా. రూ- కడ్డీ చూ, బలపము, 2.=ఖటికా. బంగారములోనగువాని కడ్డి, పాళము రూ-కడ్డీ చూ, శలాక

కడ్డీ వై. వి. —వై.—

కడ్డీగంధకము. మి వి చూ, అమరశిలాగంధకము

కడ్పు. వై వి.= గర్భమ్ చూ, రూ- కడుపు. "భూతములున్నవిగాక కడ్పునన్." హరి, పూ. 5, ఆ. 224

కడ్మి. దే. " చూ, రూ- కడిమి. (పరాక్రమము.—"సురేశ్వరుని గడ్మింబట్టి తునామ్రడ నోపిన పుత్రుఁ గనిత్తు" రా. బాల, కాం. 494 ) (తత్స-కదంబ-పురుషోత్తమకవీయము)

కణ. సం. వి. ఆ స్త్రీ. 1. కంచురేఁగ చూ, మక్షిక, 2. అజాజి * చూ, జీలకఱ్ఱ, 3.పిప్పలిమోడి *: చూ, పిప్పలి

కణఁక. దే. విణ రూ- కడఁక ఆయతము. "సీ.కణఁకనిచ్చలుఁ. . గల్పజీవియగుచు" భాగ. 5, స్కం 2, ఆ 93 చూ,యత్నము

కణఁకు దే. వి అగ్ని. పంచ. నా 1, ఆ.504 చూ, నిప్పు.

కణఁగు. దే అ క్రి రూ- కడఁగు చూ, యత్నించు

కణజము. వై వి 1. = గంజ. కుసూలము. ఉ, రా 1, ఆ 265. (ఇక్కడకోట ఉత్ప్రేక్షింపఁబడియె.) చూ, పంటసాల, 2 ధాన్య ముంచెడు పాఁతఱ చంద్రా 1, ఆ. 25 చూ, పంటసాల.

కణఁజు. దే వి చూ, రూ- కడఁజు

కణఁత. దే. వి చూ. రూ-కడఁత (ప్రకృతి- కణ-పురుషోత్తమకవీయము )

కణఁతి దే వి 1. రూ-కడఁతి "చ పులులు దుప్పులు కణఁతుల్" కాశీ 3, ఆ 48 చూ, లొట్టిపిట్ట, వై వి 2 = గ్రంథి,కంతి చూ, దుప్రిపు

కణగుగ్గులువు సం వి. ఉ పుం గుగ్గులుప్రి భేదము చూ, గుగ్గులువు.

కణచీర సం వి. ఆ స్త్రీ ఎఱ్ఱని మణిశిల చూ, రాయి

కణజమూషక న్యాయము పా గాదికిరింది పంది కొక్కు గాదిలోనే జీవించుననుపద్ధతి

కణజీకరము. సం వి అ న సన్నజీలకఱ్ఱ * చూ, జీలకఱ్ఱ

కణజీరము సం వి అ. పుం తెల్లజీలకఱ్ఱ * చూ, జీలకఱ్ఱ.

కణభక్షకము. సం వి. అ. పుం: చూ, భారి టము

కణమారిషము. సం వి. అ. పుం. చిట్టి *: చూ, భండీరము.

కణము. సం. వి. అ. పుం. 1. అంప : చూ, బాణము. 1, 2. వరిపండు చూ, ధాన్యము, 3. చిన్నకొలత చూ, పరిమితి, 4 తండుల కణము చూ, నూక, 5. ధాన్యములోనిభాగము చూ, ధాన్యము, 6. నీటిబొట్టు చూ, బొట్టు, 7. వంక చూ, మడిసంది, 8 కొంచెము చూ, స్వల్పము; న. 9.= కడఁత, కంటికడపక్క—చోటు చూ, పార్శ్వము 2

కణయము సం వి. అ పుం 1 ఒకరకపు ఈఁటె. "వ కణయకంపణముసల . పరిహరణంబులు." ఉ, హరి. 4, ఆ. 213 శరవిశేషమందురు.) చూ, బాణము. 1.

కణలాభము. సం. వి అ పుం అంధసాంధ్రమము చూ, నీళ్ళసుడి

కణసెరము దే వి ఒకరకము డేగ చూ, శ్యేనము (డేగఅని పురుషోత్తమకవీయము రూ- కనిసెరము - కడసరము - కడుసి - కణుజు కరుజు.)

కణాటీనము సం వి అ. పుం. మందపిచ్చుక చూ, పిచ్చుక,

కణాటీరకము సం వి అ పుం.—పై—

కణాతిగోడ ద్వ వి. రూ— కనాతిగోడ చూ, ప్రాచీనము 1.

కణాదుఁడు. సం వి అ. పుం ఒకానొక ముని చూ, ముని 1.

కణాది. సం. వి. ఇ. పుం. తెల్లజీలకఱ్ఱ*: చూ, జీలకఱ్ఱ.

కణాదిబొంగు. దే. వి. బొంగువెదురు చూ, వెదురు.

కణి. సం. వి. ఇ పుం 1 ఉతికెడుఁడు చూ, వస్త్రాదు; ఈ. స్త్రీ. 2. అంతఃపురస్త్రీలకుపయోగించెడు బండి: చూ, శకటము. 1.

కణిఁతి. వై. వి చూ, రూ- కంతి: చూ, దద్రువు

కణితి. దే. వి చూ, రూ-కడితి. (రూ-కణిఁతి- కడఁతి-కంతి) (ఆంధ్రపద పారిజాతము )

కణిక. సం వి. ఆ. స్త్రీ. 1 నీటిబొట్టు చూ, బొట్టు, 2. గోధుమ లోనగువాని రవ: చూ, నూక; 3. కొంచెము: చూ, స్వల్పము. 4 అంత్యంత సూక్ష్మవస్తువు: చూ, నెరసు, 5. నడిమివేలు చూ, మధ్యమ; 6. అగ్నిమంథము *: చూ, నెల్లి.

కణికము సం వి. అ పుం 1. వరిపండు: చూ, ధాన్యము, 2 కొంచెము: చూ, స్వల్పము

కణిచి సం వి. ఈ స్త్రీ 1 పుష్పించినతీఁగ* చూ, వృక్షము, 2 గుంజ*: చూ, తులాబీజము, 3 బండి: చూ, శకటము 1 (రూ- కణీచి.)

కణిశము సం. వి అ న ఎన్ను చూ, వెన్ను.

కణిశవృంతము సం వి అ న వెన్ను లోనగువాని కంకికాడ ఈఁపి, ఊఁచె

కణిష్ఠము సం విణ కడుఁగొంచెము చూ, స్వల్పము

కణీకము. సం. విణ —పై—

కణీచి సం వి. ఈ. స్త్రీ చూ, రూ-కణిచి

కణీయము సం విణ అత్యల్పము చూ, స్వల్పము

కణీయస్సు సం. విణ. రూ—పై —

కణీష్ఠము. సం. విణ. —పై—(రూ-కణిష్ఠము)

కణుఁగురిఁగ వై వి =గంధోలి చూ మత్తిక

కణుఁదురు. వై. వి.=గంధోలి. —పై—

కణుజె. దే. వి. పక్షివాళిమణుల రొమ్ము: రూ- కణుజో.

కణుజు. దే. వి. 1. —పై—; 2 దేశలలో

నోకజాతి చూ, శ్యేనము, 3 రూ-కణఁజు చూ, గోకర్ణము.

కణుపు. దే. వి వెదురుచెఱకు లోనగువానిబుడిపి చూ, బుడిపి (రూ-కనుపు, కన్ను-కోడుపు-గనుపు.)

కణేర సం. వి. ఆ స్త్రీ 1 భోగముసాన. చూ, వేశ్య, 2 హస్తినీజాతిస్త్రీ చూ, స్త్రీ; వా (1) బలవంతముగ ఆపుట

కణేరము. సం వి అ. పుం చూ, మ్రుదుద్రుమము *.

కణేరువు సం. వి. ఉ. పుం 1 —పై—, స్త్రీ. 2 భోగముసాని చూ, వేశ్య

కణ్వము. సం వి అ న 1. దోసము చూ, పాపము, 2 కొండగొఱ్ఱె చూ, మేషము 1

కణ్వుఁడు సం. వి. అ. పుం కణ్వుఁడను ఋషి చూ, ముని. 1.

కత. వై. వి 1.=కథ రూ-కద-కదా ఇంచుక సత్యమైన ప్రబంధము కాదంబర్యాది స్వా 3, ఆ. 128 చూ, సమాచారము. 2, 2 =కథ. రూ-కద-కదా తొల్లింటికత. రామా 8, ఆ 182 చూ, సమాచారము 2.

కతకము. సం వి అ పుం చిల్ల *. చూ, సల్లకి

కతకరేణున్యాయము పా. చిల్లగింజే అరగదీసి నీళ్లలోఁ గలిపిన నాగంధము నీటియందలి బురదను వేఱుపఱచి తాను గాన్పించకుండఁ బోయినరీతి

కతఫలము సం వి. అ పుం చిల్ల * చూ, సల్లకి.

కతమము సం వి అ పుం అశ్వపృష్ఠావర్తము చూ, హయము.

కతమాలము సం. వి. అ. పుం అగ్ని చూ, విష్ణు.

కతము వై వి. 1. గుఱుతు రామా 4, ఆ 169 చూ, లక్షణము. 1, 2 =గత. కారణము, (రూ-కతనము.) భార. అర. 4, ఆ. 123: చూ, హేతువు.

కతలము సం. వి అ న కడఁత చూ, పార్శ్వము. 2

కతిసోలము సం వి అ పుం కతిసోల అను పక్షి చూ, పక్షి.

కతుక్కు. దే. వి కొఱుకుటయందుపుట్టు ధ్వన్యను కరణము. శుక. 1, ఆ 183 చూ, హూహూ.

కత్తరి దే. విణ 1 శబలము. నానావర్ణములు గలది. "కత్తరియావు, కత్తరియెద్దు" మొ చూ, వర్ణము 6, 2 వర్ణసాంకర్యము గలది. విజ్ఞా. ఆచా, కాం 112. చూ, సంకరము 4, వి 3 భేదము తెలియనికూడిక చూ, సంకరము 1, 4 ఎరచిల్లపురుగు. చూ, మత్స్యము 1

కత్తరిగలయు దే అ. క్రి. (కత్తరి + కలయు.) కలిసికొను. జై 8, ఆ 213, కాశీ. 2, ఆ. 98 చూ, సంకరమగు

కత్తరిల్లు దే. అ క్రి. అల్లల్లాడు, చలించు. "ఏ గీ కటములదరంగ మీసాలగత్తరిల్ల" నై 7, ఆ. 46 చూ, సలించు

కత్తలాన వై వి. = కగ్గలాణః తెల్లని గోరిజేయుఁ దోఁకయు వెండ్రుకలును గల నల్లగుఱ్ఱము చూ, హయము (రూ-కత్తలాని-కత్తళిఁడు.)

కత్తలాని. వై. వి =కగ్గలాణః —పై —అచ్చ. బాల, కాం 11

కత్తళిఁడు. వై వి.=గంధర్వ —పై—

కత్తళము. దే వి కవచము. భార శల్య. 2, ఆ 35 చూ, బొందడము.

కత్తళీఁడు దే. విణ (కత్తళము + ఈఁడు) బొందలీఁడు చూ, వర్మితుఁడు.

కత్తవ. దే వి. 1 రూ-కత్తువ, మడికిచుట్టు నేర్పఱచిన చిన్నగట్టు చూ, గట్టు; 2. బాణము

వంటి పనిముట్టు; మట్టి పెల్లగించెడు పనిముట్టు: (రూ-కత్తువ కఱ్ఱమడ, గసిక.)

కత్తి వై. వి. 1.=కర్త్రి ఖడ్గమ్. మల్లబంధవిశేషము చూ, విన్నాణములు, 2.=కర్త్రి ఖడ్గమ్ కత్తి చూ, రిష్టి. 2, 3.=ఖడ్గమ్ కైదువు చూ, బాణము 1; 4. మంగలికత్తి చూ, మంగలికత్తి (రూ-కత్తియ-కత్తె. పురుషోత్తమకవీయము)

కత్తికాసు. వై వి వడ్లవాని ఆయుధవిశేషము చూ, బాణము. 1.

కత్తికలాండు. ద్వ వి. అసికుండు చూ, ఖడ్గి

కత్తిగంటము పా ఒకకొనను కత్తిగల గంటము.

కత్తినూఱుట జా. కలహమునకు సిద్ధమగుట. "నామీఁద కత్తినూఱుచున్నాడు" "ఇత్తఱి మనపైఁ గత్తినూఱుచున్నవాఁడెవండో యెఱుఁగరా" (సగ్గజరాజ నారాయణ.)

కత్తిపిడక వై వి కుంద్రవాని కత్తులబుట్ట

కత్తిపీట వై వి కూరలు లోనగునవి తెఱుగుటకుఁ బీటయందమర్చిన కత్తి చూ, రిష్టి. 2.

కత్తిమంగు ద్వ వి. 1. ముళ్లుగలిగి కాడలతోఁ గూడిన పాలచెట్టు *, 2 కత్తి యొఱకు పూయువర్ణము, 3 గడ్డలకు పూయు మందు

కత్తిమీఁదిసాములు జా కష్టమగు పనులు "దొరతనపుసరవుల్మతి కత్తిమీఁది సాములు సుమ్మీ" కువలయాశ్వ. వేసన 499.

కత్తియ అప. 1 ఒకానొక ప్రత్యయము "అంటుకత్తియ,చెలికత్తియ,సొగసుకత్తియ" మొ. రూ-కత్తె), 2 వై వి=కర్త్రి. అఁడుది చూ, స్త్రీ. (పురుషోత్తమకవీయము)

కత్తియము. దే వి. అంకెలబంతి. రూ-కత్తెము

కత్తిరించు. వై. క్రి. రూ-కత్రించు. వస్త్రము లోనగువాని ఛేదించు. చంద్రా. 2, ఆ. 88 చూ, చించు.

కత్తిరిల్లు వై. అ. క్రి ఛిన్నమగు. శుక. 1, ఆ 177: చూ, వేఱుపడు.

కత్తివాతియమ్ము. వై.వి. (కత్తివాయి + అమ్ము.) అర్ధచంద్రబాణము "ఆ వాఁడియైన కత్తివాతియమ్మునఁ గొని . సైనుగూఁకటుల నొనర్చె" భార అర 6 ఆ. 250 చూ, బాణము 1.

కత్తులసాన. వై వి. ఖడ్గచక్రము. చూ, సాన.2.

కత్తువ. దే. వి చూ, రూ-కత్తవ.

కత్త్యాణము. సం వి. అ. న 1. పలఘ్నము కామంచి* చూ, తృణము. 1, 2 నాఁచు* చూ, శైవలము 1

కత్తె చూ, రూ-కత్తియ.

కత్తెము దే. వి చూ, రూ-కత్తియము.

కత్తెగ. వై. వి 1.=కృత్తికా. కృత్తికా నక్షత్రము కాశీ 1, ఆ 188 చూ, నక్షత్రము 1, 2=కర్తరీ కత్తిరించెడి ఆయుధము చూ, బాణము 1, 3 భరణి మూఁడునాలుగు పాదములయందును కృత్తికయందును రోహిణి మొదటిపాదమునందును సూర్యుఁడుండు కాలము కర్తరి, 4 కత్తెవలె వ్రణములను ఖండించుటచే శస్త్రిక-కి నున్నఁబడిన పేరు చూ, సివఁగి 2, 5 మల్లబంధ విశేషము చూ, విన్నాణములు

కత్తెరకాలు. ద్వ వి అందలపుకొమ్ములకు అడుగున పోటీగా నమర్చెడు మాన్పుకాలు.

కత్తెరగాయము. ద్వ వి గవాక్షవిశేషము ఉ, హరి. 2, ఆ 94 చూ, గవాక్షము

కత్తెరచీల. ద్వ. వి మీటమునసలచీల వదలి రాకుండ దానిచివర రంధ్రమున నడ్డముగా వేసెడు చీల

కత్తెరచుక్క. వై. వి. కృత్తిక: చూ, నక్షత్రము. 1.

కత్తెరదొంగ. ద్వ వి ముడియకత్తిరించు దొంగ: చూ, ముడిచ్చు. 1.

కత్తెరనెల ద్వ. వి కార్తికమాసము చూ, మాసము. 1.

కత్తెరబావిలీ ద్వ వి. స్త్రీ కర్ణభూషావిశేషము చూ, భూషణము. 2

కత్తెరబోను. ద్వ. వి. 1. ఎలుకవల, పా. 2. అపాయకరమగుస్థితి (వా)

కత్తెరవంగ వై వి.=కర్తారికా పెద్దవంగ * చూ, వంగ

కత్తెరవాసము ద్వ. వి. ఎగురెముసగాఁ కత్తెర వలె నుంచెడు వాసము.

కత్తోయము సం వి అ న. కల్లు చూ, సుర 1

కత్రి దే. వి. జెక్కిణియను ఆటయొక్క ఒక యంగము. ఉ, రా 6, ఆ 139

కత్రించు. వై. స క్రి చూ, రూ-కత్తిరించు "ద్వి. కత్రించుకొనిసె యోగ గంరసూత్రములు." రా యు, కాం 451 పుట

కత్సవరము సం. వి అ న. మూఁపు గా, స్కంధము 1.

కథ సం. వి ఆ. స్త్రీ 1=కత-కద ఇంచుక సత్యమైన ప్రబంధము, కాదంబర్యాది చూ, సమాచారము 2, 2. తొల్లింటికత చూ, సమాచారము. 2, 3 వాస్తవార్థముగల హర్షచరితాదిగ్రంథము, ఆఖ్యాయిక చూ, పరికథ; 4. గౌరి చూ, పార్వతి 1, 5 మాహిష్మతీపురము: చూ, దేశము

కథంకథికుఁడు. సం. విణ. అడుగువాఁడు చూ, ప్రశ్నకర్త.

కథంకథిత. సం. వి. ఆ. స్త్రీ. అడుగుట చూ, ప్రశ్నము.

కథకము. సం. వి. అ. పుం. అరగడియ చూ, గడియ. 1.

కథకుఁడు. సం. విణ 1. కథచెప్పెడువాఁడు కథాప్రాణుఁడు 2. సూతుని కొడుకు: చూ, పుత్రుఁడు 1; 3. చెప్పెడువాఁడు: కథాప్రాణుఁడు, 4 పురాణము తెలిసినవాఁడు: చూ, పౌరాణికుఁడు

కథముథ అం, అర్థవేదములోని అష్టవర్గములో నొకటి చూ, అష్టవర్గము.

కథలుచెప్పునది. అం. దూతీ చతుష్టయములో నొకతె చూ, దూతీచతుష్టయము. (దీనికి మతాంతరములు మూఁడుగలవు. మూఁడవ దానిలోని పదియాఱింటిలో నిదియొకటి.)

కథాప్రసంగము సం. వి. అ. పుం. 1. వాతూలము, సుడిగాలి చూ, వాయువు; 2 ఆవుల మంద చూ, ధేనువు, 3 తొల్లింటికత చూ, సమాచారము 2, 4. వేదాంగమైన విధి కల్పము.

కథాప్రసంగుఁడు. సం వి. అ పుం. 1. దండాలుఁడు చూ, మాల (1), విణ 2. గారడీఁడు చూ, ప్రాతిహారకుఁడు.

కథాప్రాణుఁడు. సం విణ చూ, కథకుఁడు 1-3-4.

కథించు సం స క్రి ఆజ్ఞాపించు. "క అనుటయు. కథింతు నీదుకోరికయలరన్." హరి. ఉ 5, ఆ 110 చూ, సెలవిచ్చు.

కథితము సం. విణ. చెప్పఁబడినది చూ, వ్యాఖ్యాతము. 2

కథితుఁడు సం విణ. చెప్పఁబడినవాఁడు ఉక్తుఁడు

కథోద్ఘాతము. అం నాటకలక్షణమున ప్రస్తావనాంగములు మూఁడింటిలో నొకటి చూ, ప్రస్తావనాంగములు. (తనకనుకూలించు సూత్రధారుని మాట గాని సంగతిగాని గ్రహించి చెప్పుట.)

కద. వై. వి. 1. = కథ. రూ-కదా. ఇంచుక సత్యమైన ప్రబంధము కాదంబర్యాదిః చూ, సమాచారము. 2. 2. = కథ. రూ-కదా. తొల్లింటికత రా యు, కాం 72 చూ, సమాచారము. 2; దే అవ్య. 3. ప్రసిద్ధిని దెలి పెడి. ఉ, రా. 4, ఆ. 174. రూ-కదా-కదె-కదే, కా-కాదా-కాదె-కాదే

కదంపదము. సం వి అ. పుం. తెల్లావాలు: చూ, సర్షపము.

కదంబకము. సం. వి. అ పుం 1 — వై —; 2. గుంపు: చూ, సమూహము, వై విణ = (1) కరంబః. కలిసినది. (కర్పూరము అగురు చందనము కస్తూరి తక్కోలము, కుంకుమపువ్వు వీనితోఁ చేయఁబడినది) పంచ నా. 2 ఆ. 226 చూ, మిశ్రము (రూ-కదంబము)

కదంబపుష్ప. సం వి. అ స్త్రీ. ముండరిక * చూ, ముండరిక.

కదంబపుష్పి సం వి. ఈ స్త్రీ పెద్దబోడతరము *. చూ, ముండిని.

కదంబము. సం వి అ న 1 కదుపు, గుంపు. చూ, సమూహము, పుం 2 తెల్లావాలు: చూ, సర్షపము, 3 = కడిమి * చూ, నీపము; 4 కైరువు. చూ, బాణము 1, 5. శాకనిరసితము, కూరలో తీసివేసిన తొడిమెలు మొదలైనవి, 6 కలంబము చూ, కూరనార, 7. సక్తువు, పొడిపిండి చూ, సాదము (1), వై. విణ. (1) మిశ్రితము. అము 2, ఆ. 75, అం, భా ద్వి. మ. 163 (వృత్తియందు అంత్యవర్ణలోపంబు వికల్పంబుగానగు. కదంబ కావి.) చూ, మిశ్రము

కదంబముకుళన్యాయము పా. కడిమిచెట్టు పువ్వు ఒకదానిలోనుండి యొకటి వరుసగా దండవలె నుండుననురీతి.

కదంబి. సం. వి. ఈ. స్త్రీ. ఒకానొక తీఁగె *: చూ, లత. 1.

కదంబించు వై అ. క్రి. 1. మిళితమగు. "సీ. సాంబ్రాణి ధూపవాసనఁ గదంబించు వీథుల మంగళద్రవ్యములు ఘటించి." ఐ 7, ఆ. 49: చూ, మేళగించు 1; అం. క్రి. 2. మిళితముచేయు.

కదకము. సం. వి. అ. పుం. ఇల్లడ: చూ, విశానము.

కదక్షరము సం వి. అ న. కుత్సితమైన అక్షరము చూ, వర్ణము 1.

కదధ్వము. సం. వి. న్ పుం. చెడుత్రోవ చూ, మార్గము. 1

కదనము. సం. వి అ న. 1. దోసము చూ, పాపము, 2 పోరు చూ, యుద్ధము; 3. కీడు చూ, విపత్తు, అం. 4 విన్నాణములు ముప్పదిరెండింటిలో నొకటి చూ, విన్నాణములు

కదను దే వి శ్వాసగతివిశేషము చూ, హాయము

కదన్నము సం వి అ. న కుత్సితమైన అన్నము. చూ, సాదము (1.)

కదప వా వి చూ, ముచ్చిలక.

కదము. వై. వి. = స్కందము ఆస్కందితము, రవగాలు. చూ, ఖురి

కదర దే. అవ్య. (కద + ర) రూ-కదరా. సంతాపార్థకము చూ, సంతాపము.

కదరము సం. వి. అ పుం. 1. నల్లచండ్ర *: చూ, విట్ఖదిరము; 2. ఒకానొకరోగము: చూ, రోగము. 1; 3. క్రకచము: చూ, అంపము; 4. సోమవల్కము, తెల్లతుమ్మ *: చూ, విట్ఖదిరము; 5. కదిరము *: చూ, కెంజుండ్రు; 6. కానుక: చూ, లంచము.

విశే 4. కలఁగినది. (రూ-కలంకు- కళకు- కలచే.) చూ, వ్యాకులము.

కలంకనీరు. ద్వ. వి కలుషోదకము చూ. నీరు 1.

కలంకము. సం. వి అ. పుం.1.=కలంక గుఱుతు చూ, లక్షణము. 1, 2. ఇనుపచిట్టెము చూ, మండూరము, 3 రూ-కళంకము దూఱు చూ, నింద. 1, 4. కాలాయసముయొక్క మలము. రూ-కళంకము

కలంకష. సం. వి ఆ. స్త్రీ. కరతాళి · చూ, స్వరము, 2.

కలంకషము. సం. వి అ పుం. సింగము: చూ, సింహము.

కలంకారి దే. వి వ్రాఁతపనిబట్ట చూ,వస్త్రము.

కలంకి. సం విశే నిందతోఁగూడినది చూ, నిందాస్పదము.

కలంకు దే వి 1. గుఱుతు చూ, లక్షణము 1, 2 అపవాదము చూ, నింద 1, 3. కలంక, దోషము చూ, పాపము (ప్రకృతి —కలంక పురుషోత్తమకవీయము)

కలంకురము సం వి అ పుం అంబసాంభ్రమము చూ, నీటిసుడి

కలంజము సం వి అ పుం =సంబాయి* చూ, త్రిశూలిని.

కలంట. వై వి =గళంతిక చూ, పాత్రము 6

కలంతాబా పా క్రిందఁగనఁబఱచు అదనపు సంగతి (ఫుట్ నోట్) (వాడుక)

కలందరము సం వి. అ. పుం. వర్ణసంకరజాతి విశేషము.

కలందాను. హిం వి.వ్రాఁతకలములుంచు పెట్టె

కలందిక. సం వి ఆ. స్త్రీ. సర్వవిద్య

కలందువు. సం. వి. ఉ. పుం ఒకరకముకూరాకు. గోళి, ఘోళి

కలంబకంఠుఁడు. సం. విశే.చెవుడుగలవాఁడు చూ, మూఁగవాఁడు. 3.

కలంబము సం వి. అ. పుం 1.చూ, కూరనార: 2 అమ్ము. రూ-కళంబము చూ, బాణము.1, 3 కడిమి * చూ, నీపము

కలంబి సం వి ఈ స్త్రీ. తీఁగబచ్చలి * చూ, బచ్చలి

కలంబిక. సం వి ఆ. స్త్రీ తీఁగబచ్చలి కూర: కలంబువు.

కలంబుటము. సం. వి అ. న. అప్పుడు తఱచి తీసిన వెన్న, ఆవెన్న కాఁచిన నెయ్యి. చూ, మంథజము

కలంబువు సం వి ఉ. పుం చూ, కలంబిక.

కలఁక. దే వి 1 దోసము చూ, పాపము, 2 కంటికలఁక చూ, బిడాలము 2 (రూ-కలఁగుఁడు- కలఁగుండు) (ప్రకృతి -కలుష పురుషోత్తమకవీయము)

కలఁకఁబాఱు దే అ క్రి కలఁతపడు, భాగ 10 స్కం పూ 54 చూ, సంక్షోభించు.

కలఁకపాటు ద్వ వి కలఁత, కళా 4, ఆ 175 చూ, సంతాపము

కలఁకు వై వి 1 =ఖలతానము చూ, స్థానము 1, 2 జగడము చూ, యుద్ధము, 3 కల్లము చూ, ఖలము

కలఁకువ దే వి కలఁత చూ, సంతాపము (రూ- కలఁగు - కలఁచు - కలషంబొం- కరకరి- కలచు ము- కలాపు - కలాపము- కళవళము) (పురుషోత్తమకవీయము)

కలఁగఁబడు ద్వ అ క్రి. కలఁగు, భాగ ద్రోణ 4, ఆ 5, శివరా. 1, ఆ. 94 (స్వాగముసపడు) చూ, సంక్షోభించు

కలఁగఁబాఱు దే అ క్రి. —పై— (రూ-కలఁగఁబడు- , లకఁబాఱు- కలఁగు- కలఁతపడు- కలగుండుకొను- కలగుండువడు- కలగొను- కళవరపడు- కళవరపోవు-కలంచేపడు

కళవళపడు- కళవళించు ) (పురుషోత్తమ కవీయము.)

కలఁగు. దే. అ. క్రి —పై—

కలఁచియాడు. దే. స క్రి. (కలఁచి + ఆడు) కలఁగఁజేయు. భార విరా.1, ఆ 158 చూ, కలగుండువెట్టు.

కలఁచు దే. స క్రి. —పై—

కలఁత దే వి కలఁతపాటు చూ, సంతాపము (రూ-కలఁక)

కలఁతపడు. దే అ క్రి కలఁగు చూ, సంక్షోభించు

కలకంఠము సం వి అ పుం 1. కోయిల చూ, పికము, 2 తెలిపిట్ట చూ, హంస, 3 పారావతము చూ, పావురము, 4 అవ్యక్తమధురధ్వని చూ, స్వరము 2

కలకంఠీవీణాహంసస్వరము. పా. అష్టపుత్రివతీ లక్షణము చూ, లక్షణము 1

కలకండ దే. వి మధుశర్కర రూ-కల్కండ చూ, బెల్లము. 1 (దీని నే పటిక బెల్లమందురు)

కలకము సం వి. అ పుం శకులమను చేప చూ, మత్స్యము 1

కలకల దే. వి. నవ్వుటయందగు ధ్వన్యనుకరణము చూ, హహాహా.

కలకలము సం. వి అ. పుం 1 = కోలకోల గుంపునఁబుట్టిన పెద్దమోఁత చూ, స్వరము 2, 2 యక్షధూపము చూ, సర్జరసము

కలకాలము పా ఎల్లప్పుడు చూ, సతతము 2

కలకు దే వి. కళ్ళెము చూ, వాగె (రూ-కళ్ళియము - కళ్ళె - కళ్ళెము - కళ్యము- గలాము- లగాము ) (పురు-క)

కలక్టరు ఆం. మండలకరగ్రాహి, జిల్లాకు అధికారి (రూ- కలెక్టరు )

కలగర దే వి. గుంటగలగర * చూ, భృంగరాజము (రూ-గుంటకలగర- గుంటగలగర- గుంటగలిజేరు). (పురు-క)

కలగలపు దే. వి (కలపు + కలపు) 1. కలుపుఁగోలు చూ, బుజ్జగింత, (రూ-కలుపుఁగోలు- కల్పుఁగోలు- కలుపుఁగోలుతనము) 2. అనుకుగావండినకూర చూ, వ్యంజనము. 1. (రూ-కలగల్పు)

కలగల్పు. దే వి —పై.—(కలుసుఁగూరకు— పాండు. 4, ఆ 184 )

కలగుండు. దే. వి 1 కలఁత చూ సంతాపము; 2 కలుషము చూ, పాపము

కలగుండుకొను. దే. అ క్రి కలఁగు. భార. ద్రోణ 1, ఆ. 293 చూ, సంక్షోభించు.

కలగుండుపడు దే అ. క్రి —పై—

కలగుండువెట్టు దే స క్రి. కలఁగఁజేయు. "సీ సాత్యకి యేచి ధృష్టద్యుమ్నుఁడును దానుగురుసైన్యములఁ గలగుండువెట్టు." భార. భీష్మ 3, ఆ 64 ఆలోడించు, కలఁచియాడు, కలఁచు.

కలగుడు దే. వి కలుషము చూ, పాపము

కలగూర దే వి (కలపు + కూర) పెక్కుదినుసులు కలసినకూరాకు చూ, వ్యంజనము 1.

కలగొను దే అ క్రి (కలపు + కొను) 1 కలఁగు భార. విరా. 4, ఆ 169 చూ, సంక్షోభించు, 2 క్రమ్ము ఉ, హరి 5, ఆ 107 చూ, వ్యాపించు

కలఘోషము సం వి అ పుం కోయిల చూ, పికము

కలచే దే వి కలుషము చూ, పాపము

కలజొవ్వి దే వి రూ- కలుజొవ్వి * చూ, ప్లక్షము.

కలటము సం వి. అ న ఇంటికప్పు చూ, పటలము

కలతిక సం వి. ఆ స్త్రీ భుజశిరస్సుక్రింద నాలుగు అంగుళములవఱకుఁగల ప్రదేశము.

కలభకర్ణిక. సం. వి. ఈ. స్త్రీ. చూ, ఉప్పి కర్ణి *.

కలభము. సం. వి అ. పుం 1. రూ-కళభము. ఏనుఁగుగున్న. చూ, హస్తి, 2 రూ- కళభము, ముప్పదియేండ్ల ఏనుఁగు చూ, హస్తి, 3. ఒకానొకచేఁప చూ, మత్స్యము 1, 4 ఎలుకజీడి * చూ, భల్లాతకి.

కలభవల్లభము. సం వి. అ పుం. గొలుగు * చూ, పీలువు.

కలభి సం. వి. ఈ స్త్రీ ఇనుదము చూ, వ్యడంబకము.

కలమము. సం వి అ పుం. 1 కలము చూ, లేఖిని, 2. వరిపైరు చూ, సస్యము, 3 లత్తుక చూ, లక్క, 4 ఎఱ్ఱబుడమలు చూ, ధాన్యము, 5 నల్లగుఱ్ఱము చూ, హయము, 6 మొలక చూ, మొక్క, 1, 7 ఇరువదియేండ్ల ఏనుఁగు చూ, హస్తి, 8 చారము * చూ, సిరివ, 9 వరిపొట్ట చూ, పొట్ట 2

కలమోత్తమము సం. వి అ. పుం శాలిధాన్యము చూ, ధాన్యము

కలమరి దే విణ (కలము + అరి) ఓడ యెక్కి పోవువాఁడు భార. శాం 5, అ 588

కలము సం వి అ న. 1. రేతము చూ, రేతస్సు 1, 2. కోలి * చూ, సృధ్రిసఖి, పు 3 పిన్నవరగోఁగు * చూ, పెలువు, 4 అజీర్ణము చూ, రోగము. 1, విణ 5 అవ్యక్త మధురాక్షరధ్వని చూ, స్వరము 2, దే. వి (1) కలువగంధము చూ, వాసన, (2) ఓడ, కాశీ 3, అ 123 చూ, హోడము, (3) పండ్రెండుతూముల కొలఁదిగలపరిమాణవిశేషము పర 3, అ. 156; వై వి (4)=కలమ లేఖని చూ, లేఖిని.

కలముఁడు. సం వి. అ పుం దొంగ. చూ, ముచ్చు. 1.

కలయ. దే. క్రి. అంతటు "క గొలువు కలయంగనుంగొని." భార. ఉద్యో. 2. అ. 115; చూ, పిమ్మట (రూ-కలయఁగ)

కలయంపి. దే. వి చుప్పుడుఁగుటకై కస్తూరి చందనములోనుగాఁగల సుగంధవస్తువులగలపి చల్లెడు నీరు చూ, పేన్నీళ్లు. (రూ- కలవడము- కలాఁపి) (పేన్నీళ్ళు అనునవి అపరిశుద్ధ వస్తువులను శుద్ధిచేయుటయందు వాడెదరు)

కలయఁగ దే క్రి. చూ, కలయ

కలయఁబడు ద్వ అ క్రి (కలయుక + పడు) కలయు జై 3, అ 62 (స్వార్థమునపడు) చూ, పాల్పించు

కలయిక దే. వి. సంగమము చూ, సంయోగము (రూ-కలియిక-కలువ)

కలయు దే స క్రి 1 కామించు చూ, వలచు, 2 కూడు హ, న. 2, ఆ. 54 చూ, పాల్పించు, అ క్రి 3 అనఁగిపెనఁగు- చూ, మేళగించు 1

కలయుమొలువవ ద్వ వి మల్లయుద్ధములోని విశేషము చూ, మల్లశాస్త్రము

కలరవము సం వి అ పుం కపోతము చూ, పావురము

కలరా వా విషూచి, వదునవిరేచనవ్యాధి చూ, విషూచిక.

కలరు. దే. వి 1 కలిగినవారు "వాడియు సత్యముంగలరుపాండుతనూజులు." భాగ, అం 2 రంగు

కలరూపు ద్వ వి యాధార్థ్యము చూ, సత్యము. 1

కలలజము సం. వి అ. పుం చూ, సజ్జరసము

కలలజోద్భవము సం వి. అ పుం సాలము*. చూ, మద్ది

కలలము. సం. వి అ పుం, న 1 = కరువు రూ-కలిలము గర్భపిండము చూ, పిండము, 2. జరాయువు చూ, మావి, 2.

కలవ దే వి 1 రూ-కలువ-కల్వ * చూ, పద్మము 1, 2 కలయుట చూ, సంయోగము, 3 కలసిన యిసుకయు సున్నమును, 4 కలుపములగు జలాగులు, విణ 5 కలసినది చూ, మిశ్రము (ప్రకృతి-కలుప. పురుషోత్తమునకు వీయము)

కలవంటకము దే వి. (కలపు + వంటకము.) నూవుపొడిలోనగువానితోఁ గలపిన వంటకము చిత్రాన్నము చూ, సాదగ (1)

కలవడము దే వి చూ, కలయాంప

కలపడు ద్వ అ క్రి. (కలపు + పడు) కలయు "కలపడిమాటలఁ గ్రియముల" సుకన్యం 3 ఆ 64 చూ, పాంపంచు (రూ- కలయఁబడు- కలయు- కలియు - కలుగు - కల్గు - కలుపు) (పు-క)

కలవరపడు గ్యా. అ క్రి (కలవరము + పడు) కలఁతపడు చూ, సంక్షోభించు

కలవరపోవు దే అ క్రి (కలవరము + పోవు) —పై —

కలవరము దే వి 1 కలఁత చూ, సంతాపము, 2. చింత చూ, పశ్చాత్తాపము, 3 కలవరింత చూ, స్వప్నము 1 (రూ- కలవరింత- కలవరింపు- కలవరము - కలువరింత - కలువరింపు- కళవళము- పలవరింత) (పు-క)

కలవరించు. దే అ. క్రి) మైమఱచిమాటాడు అచ్చ ఆర కాం 96

కలవరింత. దే వి రూ - కలువరింత. కళా 5 ఆ 53 చూ, స్వప్నము 1 (రూ- పలవరింత.)

కలవరింపు దే వి —పై — (రూ- కలువరింపు.

కలవటము. దే వి. —పై.— (రూ-కలవరము.)

కలవాఁడు. దే. విణ, 1. ఆప్తుఁడు. "ఉ. శాంతనవుండు సర్వకురుసంతతికిఁగలవాఁడు కాఁడె" భార ఉద్యో 2, ఆ 164 చూ, స్నేహితుఁడు 1, 2 ధనవంతుఁడు "సీ. ఆరకూట కలాప మర్త్యావే కలవానికేవర్త్యామే నిర్ధరేశ్వరునకు. నై. 4, ఆ 68 చూ, సంపన్నుఁడు, 3 శక్తుఁడు. "వినుమాపనికెల్లఁ బాండుపుత్రులె కలవారు" భార ఉద్యో. 3, ఆ. 201 చూ, లావరి

కలవాలము సం వి అ పుం.=కరవాలు, కత్తి చూ, రిష్టి 2.

కలవింకము సం వి. అ పుం 1. ఊరపిచ్చుక చూ పిచ్చుక, 2 కూఁకటిమూఁగ చూ, శృంగారము 3

కలశము సం వి అ పుం న. ఈ స్త్రీ 1 ఘటము, కుండ చూ, భాండము 3. (రూ-కలసము-కలశి = నీళ్లకడవ) 2 అభియోగాస్త్రవిశేషము చూ, వ్యంగకము 1, అం 3.సంయుత శాస్త్రములు ముప్పదిరెండింటిలోనొకటి. చూ, సంయుతశాస్త్రములు

కలశరేఖ అం లక్షణాంగములలో నొకటి చూ, లక్షణాంగములు.

కలశాబ్ధి సం వి ఇ పుం పాల్కడలి చూ, సముద్రము

కలశాబ్ధిజ సం వి అ స్త్రీ పాలకున్నిటి మంగము చూ, లక్ష్మి 1

కలశి. సం వి ఇ ఈ స్త్రీ 1 కోలపొన్న* చూ, పృశ్నిపర్ణి 2 కుండ చూ, భాండము 3, పెనుగుఁజిలికెడు కుండ చూ, భాండము 3, 4. నీళ్ళకుండ చూ, భాండము 3, 5 నక్రతోఁ పొన్న * సృగాలవిన్న

కలశికీర్తని. సం వి ఈ. స్త్రీ కోలపొన్న *. చూ, పృశ్నిపర్ణి

కలశోదధి సం. వి ఇ. పుం పాలసముద్రము: చూ, సముద్రము.

కలసము. సం. వి. అ పుం. కుండ: చూ, భాండము. 3. పెరుఁగుజిలికెడు కుండ.

కలసి. సం. వి. ఇ, ఈ. స్త్రీ. 1. కోలపొన్న* పృశ్నిపర్ణి, 2. పెరుఁగుఁజిలికెడు కుండ చూ, భాండము 3, 3 కుండ చూ, భాండము.3, 3. నీళ్ళకుండ చూ, భాండము. 3.

కలసికొను దే. అ. క్రి రూ-కలిసికొను చూ, సంయుక్తమగు

కలసీసుతుఁడు. సం వి. అ. పుం. 1 అగస్త్యుఁడనుముని చూ, ముని. 1, 2. వేలుపుటొజ్జ చూ, బృహస్పతి

కలసోదధి సం. వి. ఇ. పుం. పాలకడలి చూ, సముద్రము.

కలహంస సం వి. అ. పుం 1 కాదంబము, ధూమ్రవర్ణములైన ముక్కు కాళ్ళు రెక్కలుఁగలహంస,మధురముగాఁ బలుకుహంస చూ, హంస, 2 రాజహంస, ఎఱ్ఱని ముక్కు కాళ్లుగల హంస చూ, హంస, ("రాజహంసస్తు కాదంబే కలహంసే నృపోత్తమే. ౫౩ కలహంసస్తు కాదంబే రాజహంసే నృపోత్తమే." అని విశ్వకోశము), 3 రాజశ్రేష్ఠుఁడు చూ, రాజు 1, 4 కమలినీకలహంస నాటికయందు నాయకుఁడై చెప్పఁబడ్డ రాజు చూ, రాజు.1 (రూ-కలహంసము)

కలహంసము సం. వి అ పుం.—పై —

కలహానాశనము. సం వి అ పుం నెమిలగుగు* చూ, పూతికరజము

కలహప్రియ సం. వి అ స్త్రీ. గోరువంక చూ, శారిక.

కలహప్రియుఁడు. సం వి. అ పుం నారదుఁడు చూ, ముని 1.

కలహము. సం. వి అ, పుం, న. 1 = కలన - కయ్యము. జగడము చూ, యుద్ధము, పుం. 2. సమరము చూ, యుద్ధము, 3. కత్తియొఱ చూ, ప్రత్యాకారము, 4. కట్టుట చూ, బంధము. 1; 5. శోభ: చూ, వెలుతురు. 1

కలహశీలుఁడు. సం. విశ. కచ్చెపోతు: చూ, పేచీకోరు.

కలహాంతరిత అం ముందుకోపముచేఁ ప్రియుని విడనాడి వెనుకపరితాపమునొందెడు నాయిక, నాయికలు ఎనమండుగ్రలో నొకతె: చూ నాయికలు

కలహాశనుఁడు సం. వి. అ. పుం. నారదుఁడు: చూ, ముని. 1.

కలహించు. సం అ క్రి జగడమాడు చూ, వాటులాడు

కలాంకురము సం. వి అ. పుం. బెగ్గురు చూ, సారసము.

కలాంకురుఁడు సం. వి. అ. పుం. కంసుఁడు: చూ, మూలదేవుఁడు

కలాంతరము సం. వి అ న 1. వృద్ధి. చూ, వడ్డి, 2. లాబము చూ, లాభము. 1

కలాంబిక సం వి ఆ స్త్రీ. వడ్డిబ్రదుకు: చూ, వృద్ధిజీవిక

కలాకూలము సం వి అ. న. విషము చూ, విసము 1.

కలాకేళి సం. వి. ఇ పుం మరుఁడు చూ, మన్మథుఁడు.

కలాచి సం వి ఈ. స్త్రీ.= కాళంజి. తమ్మపడిగము చూ, పాత్రము. 6.

కలాచిక. సం వి. ఆ. స్త్రీ 1 తొట్టికట్టు చూ, ముంగిలి 2, 2 ఇంటికోన చూ, ప్రకోష్ఠము, 3. బుజేముతుద

కలాటీనము సం. వి అ పుం. ఏటిగ్రంత చూ, వ్యాఘ్రాటము.

కలాదము సం వి. అ. పుం. 1. జొవ్విపండు, 2. కుక్కలమైథునము చూ, సంయోగము

కలాదుఁడు సం. వి అ. పుం. 1. అగసాలె చూ, స్వర్ణకారుఁడు, 2. చందమామ: చూ, చంద్రుఁడు, 3. విద్యచెప్పినవాఁడు: చూ,

పంతులు. 1, 4 మాతులుఁడు చూ, మేనమామ, 5. మేనమామకొడుకు చూ, మేనబావ; 6. జ్ఞాతి చూ, దాయాదుఁడు, 7 కరిచిత్తుఁడు చూ, వ్యాఘ్రుఁడు 2; 8 మొండెపుగాము, రాహువు చూ, రాహువు. 2, 9. కేతుగ్రహము చూ, రాహువు. 2

కలానిధి. సం వి ఇ. పుం. 1 చందురుఁడు చూ, చంద్రుఁడు, 2 ముక్కంటి చూ, శివుఁడు, 3 పండితుఁడు చూ, విద్వాంసుఁడు.

కలానువాది సం వి. ఇ. పుం 1. తుమ్మెద చూ, భ్రమరము; 2. చటకము చూ, పిచ్చుక, 3. కయిజా చూ, కాఁజా

కలాపకము సం. వి అ పుం 1. ఏనుఁగు మెడసంకెల చూ, శృంఖలము. 2, 2 పండ్రెండు పేటల హారము చూ, భూషణము 2, 3. నొసటిబొట్టు చూ, బొట్టు 1.

కలాపతి. సం వి ఇ పుం. చందురుఁడు చూ, చంద్రుఁడు

కలాపన దే. వి. కలఁత చూ, సంతాపము

కలాపము సం వి అ పుం 1 ఇరువదియైదు పేటలుగల స్త్రీలయొడ్డాణము చూ, భూషణము 2, 2 నెమలిపురి చూ, పింఛము 1, 3 అమ్ములపొది చూ, బాణము 1, 4 తొడవు చూ, భూషణము 2, 5 గుంపు చూ, సమూహము, 6. ఓంకారము చూ, ప్రణవము, 7 చెడ్డపలుకు చూ, చెడ్డమాట, 8 మణిఖచితమగు ప్రదేశములేక తిన్నె, 9. ఒడలు చూ, శరీరము, 10. తెలివి చూ, బుద్ధి, 11 ముక్తి చూ, మోక్షము 1, 12 చేయుట, 13. నర్తనమునందు రెండు కాళ్ళతోను మూఁడుమారులు నృత్యము చేయుట, 14. కళలలో భేదము; 15. వేదవాక్యము; 16. ఒకవిధమగు కాలము, దే. వి. (1) కలఁత చూ, సంతాపము.

కలాపి సం. వి. న్ పుం. 1. నెమలి చూ, మయూరము, 2. జువ్వి * చూ, ప్లక్షము, దే. వి. (1) రూ- కలయంపి. ఆం, భా ద్వి. పు. 23 చూ, పేన్నీళ్ళు

కలాపిని సం వి. ఈ. స్త్రీ. 1. రాతిరి చూ, రాత్రి, 2 నాగరముస్త * చూ, తృణము.1

కలాపుఁడు సం. వి. అ పుం 1, కంసాలి చూ, స్వర్ణకారుఁడు, 2 చందురుఁడు చూ, చంద్రుఁడు, 3 ఇనుఁడు చూ, సూర్యుఁడు, విణ. 4 వ్రాసెడువాఁడు చూ, శిల్పి.

కలాపూర్ణుఁడు. సం. వి అ. పుం. చందమామ చూ, చంద్రుఁడు

కలాబాక్షము సం వి అ పుం త్రిగంధాన్యము చూ, ధాన్యము.

కలాభృత్తు సం వి త్ పుం. చందమామ చూ, చంద్రుఁడు

కలానకము సం వి అ పుం. కలగధాన్యము. చూ, ధాన్యము

కలాయ సం వి. ఆ స్త్రీ గండదూర్వ * చూ, తృణము 1

కలాయకము సం వి అ పుం లంకలనెడువడ్లు చూ, ధాన్యము,

కలాయము సం. వి అ పుం. బేరము చూ, వర్తకము.

కలాయనుఁడు. సం వి అ పుం. నట్టువుఁడు చూ, నర్తకుఁడు

కలాయము. సం వి అ. పుం 1 గుండ్రని సెనగలు చూ, సెనగలు.(బోడసెనగలనివాడుక), 2. లంకలనెడువడ్లు చూ, ధాన్యము

కలాయి హిం పాత్రలకు తగరముపూయుట.

కలాలాపము. సం. వి. అ. పుం. తుమ్మెద చూ, భ్రమరము

కలాలి. హిం. వి. కల్లుసారాయులమ్మువాఁడు.

కలావతి. సం. వి. ఈ. స్త్రీ. 1. తుంబురువీణ చూ, వీణె. (తుంబురను గంధర్వునివీణె) (రూ-కళావతి), 2. కళలనుదెలిసినయాఁడుది, రూ-కళావతి. చూ, స్త్రీ, అం 3 తాళాధ్యాయప్రకరణములోని తతవాద్యములు ఇరువదింటిలో నొకటి చూ, తతవాద్యములు.

కలాలుఖానా హిం వి కల్లుసారాయలమ్ము దుకాణము.

కలావరు. అం. వి 1. (రూ- కళావరు.)-చీట్లాటలోని నలుపు గుఱుతుగల కాకితము. 2. నాసాభరణము చూ, భూషణము 2

కలావాదము. అం. శివప్రోక్తములగు చతుష్షష్టి తంత్రములలోనొకటి చూ, తంత్రములు

కలావికము సం. వి అ పుం. కోడి చూ, పుంజు.

కలావికలము. సం. వి. అ పుం చటకము చూ, పిచ్చుక.

కలాసకము. సం. వి. అ. పుం పదునాలుగంగములుగల నర్తనభేదము చూ, నాటకము 1 (తె ప — కలాసికి)

కలాసము. దే వి కుమ్మరి కుండలుచేయు సాధనము.

కలాసి హిం వి ఓడమీఁదిపనివాఁడు (రూ-కళాసి తెనుఁగునవాడుక)

కలాసికి వై వి.=కలాసకము చూ, నాటకము 1.

కలాహకము సం వి. అ పుం కాహళియను వాద్యము, నఫిరి చూ, వీణె

కలి సం వి ఇ పుం. 1 కయ్యము చూ, యుద్ధము, 2. జగడము చూ, యుద్ధము, 3 కలియుగము 4,32,000 వత్సరములకాలము చూ, యుగములు (చూ, ఊగము 2), 4 ఈఁచబోయిన కాలుగల ము చూ, పంగువు, 5 శూరుఁడు చూ శూరుఁడు 2, 6 తాఁడె * చూ, విభీతకము, ఇ. స్త్రీ. 7. కల్లము చూ, వాగె, 8 నీలి *: చూ, రంజని; 9. [illegible] సిద్ధమైన మొగ్గ: చూ, మొగ్గ 1; [illegible] (1) కఁడుగు: చూ, శుక్తము. 1; (2) పులియఁబెట్టిన కఁడుగునీరు చూ, శుక్తము. 1.

కలింగ. సం వి ఆ. స్త్రీ. పెద్దపిఱుఁదులు గల యాఁడుది చూ, స్త్రీ

కలింగకము సం. వి అ పుం. కొడిసెకాయ చూ వత్సకము (ఇంద్రయవము)

కలింగము. సం వి అ. పుం. 1. కొడిసె *: చూ, వత్సకము, 2. కర్కారుకము *: చూ, పుచ్చె, 3. కూఁకటిమూఁగ చూ, భృంగరాజము 3, 4 నెమిలడుగు * చూ, పూతికరజము; 5. కళింగదేశము. చూ, దేశము, 6 కొడిసెకాయ చూ, వత్సకము (ఇంద్రయవము); 7 కొండ చూ, పర్వతము, 8. చక్కఁదనము చూ, సౌందర్యము

కలింగి. సం. వి ఈ. స్త్రీ. కొడిసెకాయ చూ, వత్సకము (ఇంద్రయవము)

కలింగుఁడు సం విణ 1. నేర్పరి చూ, సమర్థుఁడు, పుం 2. వాయులింగము అనఁగా శ్రీకాళహస్తీశుఁడు (అని వాడుక)

కలింజకము. సం వి అ. పుం కటము చూ, చాఁప (రూ-కిలింజకము)

కలింజనము సం. వి అ పుం. మంగలిపల్లె చూ, దేశము

కలింజము. సం వి. అ. పుం. కటము చూ, చాఁప.

కలిందకన్య. సం వి. ఆ. స్త్రీ. యమునానది చూ, నది

కలిందజ. సం వి ఆ స్త్రీ.—పై —

కలిందము. సం వి. అ పుం 1. తాఁడె *. విభీతకము, పా. 2 కలిందమనుకొండ చూ, పర్వతము.

[illegible], పుం. వి. అ. [illegible]రుఁడు. చూ, [illegible]డు.

కలిక. సం. వి. అ. పుం, స్త్రీ 1= కళ్లెము చూ, వాగె; 2. మురుళము. చూ, మొగ్గ. 1

కలికము. సం. వి అ పుం 1 కొంగ చూ, బకము, దే వి. (1) శైత్యనివారణార్థము కంటికి వేసెడు మందు.

కలికారకము. సం. వి. అ. పుం. సెమిలడుగు *: చూ, పూతికరజము.

కలికారకుఁడు. సం. వి. అ. పుం. నారదుఁడు చూ, ముని. 1.

కలికారము. సం. వి. అ పుం. 1 కూఁకటి మూఁగ చూ, భృంగరాజము. 3, 2. కావ్యకమను పక్షి. చూ, పీతపుస్తకము, 3 సెమిలడుగు *. చూ, పూతికరజము.

కలికారి. సం. వి. ఈ స్త్రీ ఉపవిషభేదము* చూ, విష.

కలికాలి. సం. వి ఈ స్త్రీ కలికాలియను గిరిగొఱ్ఱె * చూ, హాలిని

కలికి. దే వి 1 రూ- కల్కి, ఆఁడుది చూ, స్త్రీ, 2 రూ- కల్కి మనోజ్ఞురాలగు ఆఁడుది చూ, స్త్రీ, 3 కొంచెపుతీఁగె చూ తెక్క 1, 4. మనోజ్ఞము, ఉ. హరి 3, ఆ. 147 చూ, సౌందర్యము

కలికోత్కలిక సా కావ్యలక్షణములోని క్షుద్రప్రబంధలక్షణమును తెలుపునది చూ, క్షుద్రప్రబంధము

కలిగించు. దే. స క్రి 1. కలుగఁజేయు చూ, సృజించు; 2 లేనిది కలుగఁజేయు చూ, సృజించు.

కలిగించుట. దే వి. చూ, పుట్టించుట

కలిగొట్టు. దే. వి. పాటల * చూ, స్థాలి. 2.

కలితనము. దే. వి. సేర్పు. భార. విరా. 4, ఆ. 228: చూ, సామర్థ్యము. 1.

కలితము. సం వి. అ. పుం, స్త్రీ 1. కళ్ళెము: చూ, వాగె, విశే. 2. ఎఱుఁగఁబడినది: చూ విదితము 1, 3. పొందఁబడినది చూ, ప్రాప్తము. 1.

కలితాంతము (గీతాలంబనము) సా ఒకానొక వృత్తము. ఇంగ్లీషుకు ప్రతిపాదమునందు త, జ, జ, వ, గణములుగలదై ఎనిమిదవయింట యతిగల ఏకాదశ ఛందస్సునందుఁ బుట్టిన వృత్తము. ఉదా — "సామోద్భవవిక్రమ సంయుతమై, వేమాఱుతజాలగ । విస్ఫురితమై, దామోదరదేవుక, థల్వలుకన్, భూమింగలితాంతము । పూర్ణముగున్ "

కలితాపసుఁడు సం వి అ పుం.= కలసతిపసి. నారదుఁడు చూ, ముని 1

కలితి, కల్తి హిం మిశ్రము, స్వచ్ఛముకానిది.

కలిదుఁడు సం. వి ఇ 1 అప్పుఁడు చూ, స్నేహితుఁడు 1, 2 జ్ఞాతి చూ, దాయాదుఁడు, 3 చుట్టము చూ, బంధువు

కలిదైవత్య సం వి అ స్త్రీ. పగునాల్గవ తిథి, చతుర్థి చూ, తిథి 1

కలిద్రుమము సం. వి. అ పుం తాండ్ర * చూ, విభీతకము

కలినాగాంశము సా పన్నగాంశములలోని 27-41 అంశము (లు) చూ పన్నగాంశము లు

కలిప్రియుఁడు సం వి అ పుం 1 నారదుఁడు చూ, ముని 1, 2 కోఁతి చూ, వానరము

కలిభుజశకము అం శకములులెక్కింపులోనొకటి చూ, శకములు

కలిమము దే వి. సంజ్ఞడు. "ద అప్పుడు దంపి తిత్తొలిచి గాలిగొనవైచిన దుక్క కలిమంబు గనుంగొని." భార. శాం. 3 ఆ. 285: చూ, మాంసము.

కలిమారకము. సం. వి అ. పుం. సెమిలడుగు *. చూ, పూతికరజము. (రూ-కలికారకము)

కలిమాలకము. సం.వి.అ.పుం: చూ, రూ. కలిమారకము
కలిమాలయుఁడు. సం. వి. అ. పుం. ఎకిమీఁడు· చూ, ప్రిభువు. 2.
కలిమాల్యము. సం. వి. అ. పుం నెమిలడుగు * చూ, పూతికరజము
కలిమి దే వి. రూ- కల్మి 1. అతిశయము చూ, హెచ్చు. 2; 2. సంపద "క కలిమి యచేసుట్టలఁజేర్చును " భార. శాం. 1, ఆ.51 చూ, సంపత్తి. 1; 3. తానము చూ, స్థానము. 1; 4. కలుగుట. "ఇట్టిమహిమ కలిమికిఁ గతమెయ్యది." భార ఆర. 4, ఆ. 189· చూ, పుట్టించుట
కలిమిచెలి దే వి లచ్చి· చూ, లక్ష్మి. 1
కలిమిదండుగ ద్వ వి. నేరములేకున్నను ధనవంతునియొద్ద రాజు పుచ్చుకొనెడు ధనము
కలిమిలేములు. లో. భోగాములు చూ, కష్టసుఖములు. "కలిమిలేములు కావడికుండలు."
కలిమోహనము. సం. వి అ పుం పండ్లతోనిండిన మేడి * చూ, మేడి
కలియకట్టు దే. అ క్రి. 1. కలిపిగట్టిగా అంటఁగట్టు, 2 అంటుకట్టు చూ, తొక్కు 3.
కలియఁబెట్టు. దే స క్రి. ఎనియఁజేయు చూ, ఎనుచు, ఎనుపు.
కలియిక దే వి చూ, రూ- కలయిక
కలియికలాగులు. పా ఒకానొక రతిబంధము· చూ, రతిబంధము
కలియు. దే. స క్రి రూ-కలయు పొందు చూ, ప్రాప్తించు (కలుపు కలుపుఁగోలు ఇత్యాది సాధారణప్రయోగములంబట్టి ఇట్లు ఇకారమధ్యముగాను వ్రాయఁబడియె )
కలియుగము. అం 1. యుగములు నాలుగింటిలో నొకటి చూ, యుగములు. (చూ, కలి 3) పా. 2. కలియుగంబున భూపతనలగ్నమే జన్మలగ్న మని శాస్త్రము చెప్పుచున్నది. ఈసమయమునుబట్టి నన్మలగ్నము కల్గివెల్లివలెను.
కలియుగవర్జ్యములు అం. సముద్రయానము, అన్యవర్ణస్త్రీని బెండ్లియాడుట, పుత్రోత్పత్తి మధుపర్కములయందుఁ బశువధము, శ్రాద్ధములయందు మాంసపరిగ్రహము, వానప్రస్థసన్న్యాసములు, పెండ్లియైన పడుచునకు మఱలఁబెండ్లి చేయుట, నరమేధాశ్వమేధ గోమేధములు, మహాప్రస్థానగమనము. (8)
కలిలము. సం వి అ. న. 1 ఆఁడుదాని రక్తమును మగవానిరేతస్సును కలిసినముద్ద· చూ, రేతస్సు. 1, పుం 2. గండ్రగొడ్డలి చూ, ముద్గరము, 3. పరస్త్రీ సంగమము చూ, సంయోగము, 4. ఎఱుఁగరానిది చూ, రహస్యము, 5 చొరరానిది చూ, దుర్గమము.
కలివ. సం. వి. ఆ. స్త్రీ కశ్యము చూ, వాగె.
కలివి దే. వి రూ-కలివె * చూ, సొమ్ముపుష్పఫల. (ప్రకృతి. కరివింద. పురుషోత్తమ కవీయము.)
కలివె దే వి రూ— వై — (ప్రకృతి. కరమర్ద పురుషోత్తమకవీయము)
కలీనము. సం వి అ పుం. పచ్చగుఱ్ఱము చూ, హాయము
కలీయము సం వి అ పుం, న కల్లెము చూ, వాగె.
కలు దే వి రూ- కల్లు 1. శిల. లక్ష్మి. 2, ఆ. 56· చూ, రాయి; 2 బండిచక్రము. కాశీ, 1, ఆ 77 చూ, బండికల్లు, వై వి. 3 మద్యము. ఉ. హరి 4, ఆ 132 చూ, సుర 1, 4 మద్య విశేషము· చూ, సుర. 1
కలుఁగానుగు. దే వి. (కలు + కానుగు) తొయంతి. * చూ, వాసికము. 1 (రూ- కలుఁగానుగు)

కలువడము. వై. వి (కలువ + వడము) ఉత్స వాదికాలములలో ధ్వజస్తంభములోనగువాని యందు వేసిలఁగట్టెడు బంగారు కలువపూ దండ, కళా. 2, ఆ 9, రా. అ.కాం 52, భార ఆది 6, ఆ 149 చూ, వితానము

కలువము దే. వి రూ-కల్వము. మందునూఱు ఱాయి చూ, రాయి.

కలువరాయఁడు వై. వి. చేందమామ చూ, చంద్రుఁడు (ఇట్లు కలువ ఱేఁడులోనగునవి)

కలువరింత దే వి చూ, రూ- కలవరింత

కలువరింపు దే వి —వై—

కలువఱాకట్టు. ద్వ. వి.శిలాబంధపుష్కరిణి చూ, సరస్సు. 1.

కలువ ఱేకు ద్వ వి. 1. కలువపూ ఱేకు చూ రూ- కల్వ ఱేకు, బ 2 రూ- కల్వ ఱేకు పిఱుఁదులమీఁది నఖక్షతము చూ, నఖక్షత ము, బ. 3. కంటియంగుఁజేయు నఖక్షతము, రూ-కల్వ ఱేకు మా, నఖక్షతము.

కలువలదాయ. వై వి తమ్ములవిందు "కలువల దాయ వంగడపుఁగోడవ" అచ్చ యు.కాం 79 చూ, సూర్యుఁడు (ఇట్లుకలువలసూఁడు)

కలువల ఱేనితోడు ద్వ వి లచ్చి చూ,లక్ష్మి 1.

కలువవిందు ద్వ వి కుముదబాంధవుఁడు రామా 6, ఆ 30 చూ, చంద్రుఁడు (ఇట్లు కలు వచెలి)

కలువు దే. అ క్రి చూ, రూ- కలుగు (పుట్టుట — "ఉ. నీవుగలువక నియతోన్న తిఁగాంచె దండ్రియున్" వసు 5, ఆ 15, పొందు.— "క రారాపుతేలచేసెదు, రా రాసనుఁగలువఁ గలువరారామేడక్" సా. 2, ఆ. 128)

కలుషము సం. వి అ. న. 1.= కలుచే చూ, పాపము, 2. భయానకరసము, నవరసములలో నొకటి: చూ, రసములు, పుం 3. దున్నపోతు చూ, మహిషము, 4. కోపము·చూ,రోషము; 5 పులికడుగు చూ, శుక్తము. 1; 6. గాలి: చూ, వాయువు, 7 దుమ్ము· చూ,రేణువు.1; 8 నెల చూ, మాసము. 1, విణ 9. కలఁకఁ బాఱినది చూ, మలినము 3, 10 చరించు నది చూ, తరళము, 11 చిత్రవర్ణముకలది చూ, వర్ణము 6.

కలుషించు. సం అ క్రి కలఁకఁబాఱు. [illegible] ఉ 2, ఆ 29, భార విరా 2, ఆ 48 చూ, సంక్షోభించు

కలుషుఁడు సం వి. అ పుం. రక్కసుఁడు చూ, రాక్షసుఁడు 1

కలుసుఁగూర ద్వ వి (కలుసు + కూర) అనుకుగావండినకూర "కలుసుఁ గూరలును బజ్జలుఁదియ్యచేరులుఁ బంచేరారలు నానవాలు జొన్న" జై 3, ఆ 50 (కలగలు పుకూర అనివాడుక) చూ, వ్యంజనము 1.

కలోపనతి అం మధ్యమగ్రామగత మూర్ఛనలు ఏడింటిలో నొకటి చూ, మధ్యమగ్రామగత మూర్ఛనలు.

కల్కండ దే వి. చూ, రూ- కలకండ

కల్కఫలము. సం వి అ పుం దాడిమము * చూ, దానిమ్మ

కల్కము సం వి. అ పుం, న 1 కపటము చూ, వ్యాజము. 1, 2 కలుచే చూ,పాపము, 3 నెయ్యూనూనెలోనగు వానియందు అడుగున నిలిచినమడ్డి చూ, మడ్డి 2, 4 ఏరుగడము చూ, మలము. 1, 5 మలసామాన్యము చూ, మలము, 1, (క్రొవ్వు, రేతస్సు, నెత్తురు, మెదడు, మూత్రము, విష్ట, గులిమి, చీమిడి, తెమడ, కన్నీరు, పుసి, చెమటయనుపండ్రెం డువిధములయిన మలములు), 6 తాఁడే * చూ, విభీతకము

కల్కి. సం. వి ఇ పుం. 1 తాండ్ర * చూ, విభీతకము, 2. దశావతారములలో నొకటి చూ, అవతారములు. (రూ- కలికి), దే. వి. (1) రూ- కలికి ఆఁడుది చూ, స్త్రీ. (2) రూ- కలికి మనోజ్ఞురాలగు ఆఁడుది చూ, స్త్రీ

కల్కుఁడు. సం. విణ పాపాలముద్ద చూ, పాపాత్ముఁడు

కల్ల. దే. వి. 1 చూ, రూ-కలుఁగు. 1- 2- 3, అ. క్రి. 2. చూ, రూ- కలుగు 1- 2- 3- 4- 5- 6-

కల్లేటు. దే. వి కన్నియలేడి చూ, మనోవ క్షము (ఆంధ్రపద పారిజాతము)

కల్పకము సం వి అ పుం 1 తెల్లతుమ్మ * చూ, విట్టిదిగము, 2 కల్పవృక్షము *: చూ, వేలుపుఁజెట్టు, 3 కప్పూరము చూ, సిగము

కల్పకవద్వల్లి సం వి ఈ. స్త్రీ అడవికాఁకర చూ, సుషవి, 1

కల్పకుఁడు. సం వి అ పుం నాపితుఁడు చూ, మంగలి

కల్పక్షయము సం వి. అ పుం బ్రహ్మప్రళయము, తుగ్రింగుడు చూ, సంవర్తము 1 (బ్రహ్మదినప్రళయము)

కల్పన సం వి ఆ. స్త్రీ 1 ఆయిత్తము చేయుటకై యేనుఁగునకుఁ గట్టిన నిడుత్రాడు, 2. కల్పించుట చూ, రచన

కల్పనము సం వి. అ న 1. క్లృప్తి చూ, సంగ్రహము. 2, 2 కల్పన చూ, రచన, 3. మనోవ్యాపారము, ఎన్నిక చూ, సంకల్పము.

కల్పపాదపము. సం. వి. అ. పుం. కల్పవృక్షము చూ, వేలుపుఁజెట్టు.

కల్పము. సం. వి. అ. పుం. 1. బ్రహ్మప్రళయము, కల్పాంతము, తుగ్రింగడు. చూ, సంవర్తము. 1; 2. దేవతరువు *: చూ, వేలుపుఁజెట్టు, 3. పాడి చూ, సత్యము. 1, 4. బ్రహ్మదినము, 5. వేదాంగమైనవిధి: కథాప్రసంగము; 6 నియమసగ్రంథము. చూ, శాస్త్రములు; 7. అవాంతరకల్పము: చూ, వికల్పము; 8. భ్రష్టము కాని ధర్మము, 9. వేదాంగకల్పశాస్త్రము, 10 స్వోచితధర్మమును వదలకుండుట; విణ 11. కొంచెము తక్కువగానున్నది, (నపుంసకలింగమును అగును), అం. 12. శాస్త్రములు ఆఱింటిలోనొకటి చూ, శాస్త్రములు, 13 వేదాంగములు ఆఱింటిలో నొకటి చూ, వేదాంగములు; 14. విద్యలు పదునాలుగింటిలోనొకటి చూ, విద్యలు, 15 కల్పమనఁగ కల్పించునది.= వేదములోఁ జెప్పఁబడియున్న దర్శపూర్ణమాసాది యాగములలోఁ జేరియున్న క్రియలను దేనితరువాత నేదియో అనుసను బోధించెడిగ్రంథము ఈ కల్పసూత్రములు నాలుగు వేదములకును వానిలోఁ జేరిన ప్రతిశాఖకును ఒక్కొక్క గ్రంథము చొ॥ పుట్టియున్నట్టు కన్పట్టుచున్నవి అవియేలాగుననిన — ఒక యజుర్వేదమునకు కలిగియున్న నూటొక్క శాఖలలో కాలవశముచేత నశించినన్ని నశింపఁగ నిప్పటిలో ఆపస్తంబ, బోధాయన, సత్యాషాఢ, భారద్వాజ, హిరణ్యకేశ, వైఖానససూత్రములని యారు నిలిచియున్నవి. వీటిలో మొదటి రెంటిని వేదభాష్యములో సాయణాచార్యులని నామాంతరముగల మాధవాచార్యులవారు ప్రధానములుగ నెంచి వీనితో సమన్వయముగ వేదార్థమును వివరించియున్నారు ఆపస్తంబకల్ప సూత్రమునకు 32 ప్రశ్నములు. బోధాయనకల్పసూత్రమునకు ౧౦౧ ప్రశ్నములు. వేదముక్రియని పించుకొనును. దానియందు విధింపఁబడిన కర్మములు శ్రౌతములనిపించుకొనును. ఆది

ప్రధానకర్మలు, తదంగకర్మలు అని రెండు విధములు. వాటివిధమును కల్పసూత్రముల చేతఁ దెలిసి చేయించెడివారు ఋత్విక్కులు, శ్రౌతులు అనిపించుకొందురు. యజుర్వేద కల్పసూత్రజ్ఞులు అధ్వర్యులనిపించుకొందురు ఋగ్వేదకల్పసూత్రజ్ఞులు హోతలు, సామ వేదకల్పసూత్రజ్ఞులు ఉద్గాతలు, అథర్వవేద కల్పసూత్రజ్ఞులు ఆగమికులు అనిపించు కొందురు ఇంకులో కొన్ని గృహ్యసూత్రములు, ధర్మప్రశ్నములు అని వేఱువేఱుగా నున్నవి వానిలో వివాహోపనయనాది వైదికాచారములుకొన్ని ఖిలశాఖాశ్రుతిసిద్ధములైన ధర్మములను విధింపఁబడెను. ఆగ్రంథములు స్మృతులనియును వానియందు విధింపఁబడిన కర్మములు స్మార్తములనియు వాడఁబడును ఆపస్తంబకల్పసూత్రమునకు ధూర్తస్వామికృతమైన భాష్యముకలదు ఈలాగుననే ప్రతికల్పసూత్రమునకును వేఱువేఱు భాష్యములును వ్యాఖ్యానములునుకలవు. ఆపస్తంబముని చేసిన శ్రౌతప్రశ్నములేమి గృహ్యమేమి యావచ్ఛుభకర్మలను గుఱించినవే కాని మఱియొకటికాదు అనఁగ నౌపాసనము మొదలుకొని అశ్వమేధాంతము క్రతువులును, నిషేకాదిశ్మశానాంతములైన షోడశకర్మములును చెప్పఁబడినవనుట అయితే ఆపస్తంబముని శుభమునుబోధించిన తననోటనశుభమును బోధింపసమాధానములేనందున నంకున గుఱించి తనశిష్యుఁడైన భరద్వాజమునిచేత చేయించెను ఆసూత్రములోఁ జెప్పఁబడినది యావత్తును ఔర్ధ్వదైహికము బ్రహ్మమేధసంస్కారమును అనిపించుకొనును ఈ యజుర్వేదము యజ్ఞములకు ముఖ్యమంత్రమైయున్నది. అనఁగా హోమములు మొదలైనవానికి నుపయోగించెడిది అనుట. అట్టి హోమములనందుకొనఁగల దేవతలను పేరుపేరువరుసల పిలుచుటకును పొగడుటకును నుపయోగించెడి మంత్రములు ఋక్కులు, అవి కలదిఋగ్వేదము ఒకదేవతను పొగడెడి ఋక్కులగుంపు స్తుతము = స్తోమము అనిపించుకొనును ఈఋక్కులలో మొదటివానినందుకొనివైదికములైన సప్తస్వరములతో పాడిన ఉద్గానము = అదే సామమనిపించుకొనును. ఋగ్వేదమున కాశ్వలాయన కల్పసూత్రము ప్రసిద్ధము. సామవేదమునకు ఛాందోగ్య కల్పసూత్రము ప్రసిద్ధము. ఈమూడు వేదములేకగ్రీవమై అన్నిశాఖలవారికి సమస్తక్రతువులును నడిపించుచుండును అథర్వవేదమైన యీమూఁటిని జెందక ప్రత్యేకముగా శ్యేనయాగము మొదలైన అభిచారికకర్మములనఁగా శత్రుసంహారము ప్రయోజనముగాఁగల జపహోమాదులనువానిని విధింపుచుండును అందులో అథర్వణభద్రకాళి మొదలైన యుగ్రదేవతల ప్రార్థనలు బహుఋక్కులయందుఁ గలిగియుండును ఆమంత్రములకు ఆకర్షణము, స్తంభనము, మారణము, మోహనము, వశీకరణము, ఉచ్చాటనము అనెడు షట్ప్రయోగములు మొదలైనవాటిని బోధించుటకై దూర్వాసకల్పసూత్రము మొదలైనవికలవు. అది యావత్తుమంత్రశాస్త్రము = ఆగమశాస్త్రమనిపించుకొనును (చూ, ఉపవిద్యలు)

**కల్పవృక్షము** సం. వి. అ. పుం. 1. కోరినవస్తువులనిచ్చెడు దేవవృక్షసామాన్యము* చూ, వేలుపుఁజెట్టు, అం. 2 కల్పవృక్షములయిదింటిలోనొకటి. చూ, కల్పవృక్షములు, 3. మహాదానములు పదునాఱింటిలో నొకటి: చూ, మహాదానములు.

**కల్పవృక్షములు** అం. మందారము, పారిజాతము, సంతానము, కల్పవృక్షము, హరిచందనము.(5)

కల్పసూత్రములు వా. (అగ్ని వైశ్య సూత్రే) బోధాయనాది తొమ్మిది సూత్రములు.— 1 బోధాయనము, 2 ఆపస్తంబము, 3 సత్యాషాఢము, 4 ద్రాహ్యాయణము, 5 ఆగస్త్యము, 6 శాణ్డిల్యము, 7 ఆశ్వలాయనము, 8 శాంభవీయము, 9 కాత్యాయనము — ఇవి షోడశసంస్కారాత్మకములై కర్మప్రతిపాదితమగు పూర్వకాండమును మాత్రము వచించుటచే నీసూత్రములు పూర్వసూత్రములు, వైఖానసాది తొమ్మిది సూత్రములు.— 1 వైఖానసము, 2 శౌనకీయము, 3 భారద్వాజము, 4 అగ్ని వైశ్యము, 5 జైమినీయము, 6 (మా) వాధూలము, 7 మాధ్యందినము, 8 కౌణ్డిన్యము, 9 కౌషీతకము — ఇవి నిషేకాద్యష్టాదశ సంస్కారాత్మకములై కర్మ ప్రతిపాదిత పూర్వకాణ్డమును బ్రహ్మప్రతిపాదితమగు అపరకాణ్డమును వచించుటచే నీసూత్రములు అపర సూత్రములు. (చూ, ఆపస్తంబము అచ్చుల అనుబంధములో) ఈసూత్రానుష్ఠాతలందఱును బ్రాహ్మణులే ఇందొకరికంటె మఱియొకరు శ్రేష్ఠులనిగాని తక్కువవారనిగాని చెప్పుట మహాఋషుల దూషించుట యగును

కల్పాంతము సం వి అ పుం ప్రళయము, తుర్రింగుడు చూ, సంవర్తము. 1.

కల్పించు. సం. స క్రి 1 కలిగించు చూ, సృజించు, 2. రచించు చూ, విరచించు.

కల్పితము సం వి అ. పుం 1 నిర్మించిన యేనుఁగు చూ, హస్తి, విణ 2. రచియింపఁబడినది చూ, విరచితము.

కల్మషము, సం. వి. అ. పుం. 1 కసటు చూ, పాపము; 2: చూ, హస్తపుచ్ఛము; పుం. 3. ఒకానొక నరకము: చూ, నరకములు; 4. నలుపు: చూ, వర్ణము. 6, విణ. 5 నల్లనిది చూ, వర్ణము. 6, 6. కలఁకఁబాఱినది చూ, మలినము. 3.

కల్మని. సం. వి ఈ. స్త్రీ. పాండాను చూ, పాదపము. 1. (చూ, పాత్రము. 6)

కల్మషకంఠుఁడు. సం. వి. అ పుం. ముక్కంటి; చూ, శివుఁడు

కల్మషపాదుఁడు. సం వి. అ పుం. ఇక్ష్వాకువంశీయుఁడగు అయోధ్యాధిపతి, సౌదాసుఁడనురాజు చూ, రాజు 1.

కల్మాషము సం వి అ. పుం. 1. చిత్రవర్ణము చూ, వర్ణము 6, 2. నలుపు. చూ, వర్ణము 6, 3 అలచందలు చూ, రాజమాషము, 4 కసటు చూ, పాపము, 5 కోపము చూ, రోషము, 6. నలుపెక్కువగాఁగల తెలుపు చూ, వర్ణము 6, విణ. 7 చిత్రవర్ణము గలది చూ, వర్ణము 6, విణ 8 నలుపెక్కువగాఁగల తెలుపుగలది చూ, వర్ణము 6, 9 తెలుపుగలది చూ, వర్ణము 6

కల్మాషి సం వి ఈ స్త్రీ. 1 ఎఱ్ఱపులుపుగల తెల్లని వస్తువు, 2 కల్మాషిని చూ, నది, 3 [illegible] చూ, [illegible] 12, 4 గుదము చూ, ముడ్డి

కల్మాషుఁడు సం వి, అ పుం రక్కసుఁడు చూ, రాక్షసుఁడు 1

కల్మి దే వి చూ, రూ- కలిమి.

కల్య సం వి ఆ స్త్రీ. 1. ఆఁడుది చూ, స్త్రీ, 2 =కల్లు. చూ, సుర. 1, 3. మంచిమాట చూ, హితవచనము, 4 కరక* చూ, హరీతకి.

కల్యము. సం. వి అ. న. 1. వేకువ: చూ, వేగుజాము, 2.=కల్లు: చూ, సుర 1; 3 ప్రభాతము. చూ, ప్రత్యూషము; విణ. 4. ఏడమూకుఁడు: చూ, చెవిటిమూఁగ; 5. ఉపాయము

కలది. (మాట)' చూ, హితవచనము, 6 శుభమైనది. (మాట) చూ, హితవచనము, 7 రోగములేనిది చూ, వార్తము. 8, 8 సంపాదింపఁబడినది చూ,సంపాదితము, 9. తరుణమునఁదగినది రూ-కాల్యము

కల్యాజగ్ధి సం. వి. ఇ. .స్త్రీ కల్యవర్తము చూ, ప్రాతరోభ్జనము

కల్యత్వము. సం వి. అ. న రోగములేమి అనామయము, ఆరోగ్యము

కల్యపాలుఁడు సం వి అ పుం. కబ్బిలి: చూ, సురాజీవి

కల్యవర్తము. సం వి. అ. పుం. కల్యజగ్ధి చూ, ప్రాతరోభ్జనము

కల్యాణ. అం. ప్లుతములలో నొకటి చూ, ప్లుతములు.

కల్యాణగోత్రి సం వి. అ. స్త్రీ. గంగానది: చూ, నది.

కల్యాణగోత్రము సం వి అ. పుం. 1 మేరువు' చూ, పర్వతము, 2 అర్కపర్ణము * చూ, జిల్లేడు, 3 మంచిదారి చూ, సన్మార్గము

కల్యాణబీజము సం వి అ పుం. మసూరము బిల్లతలగడ చూ, లోడు.

కల్యాణము. సం వి అ న 1 క్షేమము చూ, శుభము 1, 2 చొక్కపుబంగారు చూ, లోహము 1, 3 బుద్ధి, వృద్ధియను ఓషధి ద్రవ్యాంగము చూ, వృద్ధి, 4. పెండ్లి చూ, వివాహము, 5 అక్షయము చూ, శాశ్వతము, విణ 6 మంగళకరమైనది చూ, శుభము 1.

కల్యాణి సం వి. ఈ. స్త్రీ. 1 గౌరి చూ, పార్వతి. 1, 2 నేల చూ, భూమి. 1, 3 ఒకానొక రాగము' చూ, స్వరము 2 4 కారు మినుము చూ, మినుము, 5 ఆవు చూ, ధేనువు.

కల్యాణిక సం. వి. అ స్త్రీ మణిసిల: చూ, రాయి.

కల్యాణిని. సం. వి. ఈ. స్త్రీ. 1. బల *:చూ, ముత్తవపులగము, విణ. 2 కల్యాణ విశిష్టమైనది.

కల్యాపాలుఁడు. సం. వి. అ. పుం. కల్లమ్ము వాఁడు: చూ, సురాజీవి.

కల్యుఁడు. సం వి. అ పుం. 1 దక్షుఁడు, నవబ్రహ్మలలో నొకబ్రహ్మ చూ, బ్రహ్మ 1; 2. నిగతరోగుఁడు చూ, వార్తుఁడు; 3. నేర్పరి చూ, సమర్థుఁడు, 4. మూఁగవాఁడు. చూ, మూఁగ 3, 5 చెవిటి చూ, బధిరుఁడు

కల్ల. దే వి 1. పరుషవచనము, పర 3. ఆ. 297 చూ, పరుషము. 2, 2. అసత్యవచనము, కళా. 3, ఆ. 246 చూ, వితథము; 3 తప్పు, సా. 2, ఆ 251 చూ, నేరము; 4. మోసము, అచ్చ. యు, కాం 116 చూ, వంచన, 5. తోఁటలోనగువాని వెలుగు. "వెలికల్లమై తురా వేల్పులకుఁడుపుచో." ఉ, హరి. 4, ఆ 308 చూ, ప్రాచీనము. 1; విణ 6. అసత్యము చూ, వితథము; 7 పరుషము చూ, పరుషము. 2

కల్లంగిడి ద్వ వి సారాకొట్టు చూ, గృహము 1.

కల్లంబు అం విన్నాణములు ముప్పదిరెండింటిలో నొకటి చూ, విన్నాణములు (రూ-కల్లము)

కల్లఁడు. సం విణ చెవిటి చూ, బధిరుఁడు.

కల్లజేగడము ద్వ. వి అభ్యాఖ్యానము: చూ, యుద్ధము

కల్లతనము. దే వి. 1 చెడ్డనడత, కాశీ. 4, ఆ. 90 చూ, తప్పునడత, 2. మోసము, భాగ. 6, స్కం. 5 చూ, వంచన,

కల్లత్వము సం వి. అ. న. స్వరభేదము చూ, స్వరము. 2; 2. చెవుడు' చూ, పెద్దవిన్నపము

గవమొ.'' చూ, సంగడి, 5 (రెండర్థములు నొకటిగానే చెప్పుచున్నారు.)

కవకము. సం.వి.అ పుం.ముద్ద చూ, సాపాటు.

కవకవ. దే వి. 1 నవ్వుటయందగు ధ్వన్యనుకరణము, జై. 6, ఆ 116. చూ, హహా హహా, 2. పలుకుటయందగు ధ్వన్యనుకరణము. ఉ, రా. 7, ఆ 283. చూ, హహా హహా, 3. వ్రాలుటయందగు ధ్వన్యనుకరణము, నళ. 3, భా. 971 చూ, హహాహహా

కవచపత్రము. సం. వి అ న బుజపత్త్రి * చూ, భూర్జము

కవచము. సం వి అ పుం. 1 బొందలము చూ, బొందడము, 2 తప్పెట, పటహము, ఢవణము చూ, వీణె, 3. కలజువ్వి * చూ, ప్లక్షము, 4 పర్పాటకము* చూ, తృణము 1, పుం, స్త్రీ 5 ఱొమ్ము చూ, వక్షము, 6 ఆకు చూ, పర్ణము 1. 7 రాత్రి మేలుకొనియుండుట' చూ, జాగారము, 8 సన్నాహము చూ, యత్నము

కవట దే వి 1 పెద్దకొమ్మ, భార విరా 1, ఆ. 162 చూ, శాఖ 1, విణ 2 లేత చూ. సుకుమారము. "కవటాకు" మొ

కవటి సం వి ఈ స్త్రీ కవాటము చూ, తలుపు.

కవడె దే వి వాద్యవిశేషము, ఆం, భా ప్ర నాట్య 128 చూ, వీణె (రూ-కవిడి )

కవణకాడు. దే. విణ మల్లగమనము దెలిసినవాడు, ఆం, భా ద్వి. కు 208

కవణము వై వి.=ఖాదనమ్ గుఙ్జము మొదలగు వానియొక్క ఉలవలు లోనుగాగల భక్ష్యము; జై 2, ఆ. 16 చూ, భక్ష్యము. (రూ-కవళము )

కవనము సం వి అ. పుం.కవిత్వమును చెప్పుట (వాడుక.)

కవను. దే. వి. కసవు; ఆం, భా. ద్వి. వ. 76. చూ, తృణము 1

కవపులుగు దే వి. జిక్కవపక్కి' చూ, చక్రవాకము. (ఆం. ప చర. 31 )

కవపుల్గుదాయ. దే వి. చేందురుడు చూ, చంద్రుడు.

కవయి సం వి ఈ. స్త్రీ చొఆచేప చూ, మత్స్యము 1

కవయుట. దే వి 1. రతి, గూ, సంయోగము, 2. కూడిక' చూ, సంయోగము.

కవరం. సం వి ఆ. స్త్రీ. బర్బర * చూ, వాయింట

కవరకి సం. వి. ఈ. స్త్రీ 1 కారాగారబంధము' చూ, బంధనాలయము, 2 శిఖ గూ, సిగ

కవరము సం విణ 1 శిఖ చూ, సిగ, 2 కూడుకొన్నది చూ, సంయుక్తము, 3 చెక్కబడిన గి చూ, రుషితము, పుం వి 4 ఉప్పు' చూ, లవణము. 1.

కవరి సం. వి. ఈ. స్త్రీ. కొప్పు చూ, వేసలి.

కవరు వా వి 1 (వ్రాసినజాబును ఉంచెడు) కాగితపు సంచి (ఎన్వలప్), 2 పైకప్పు.

కవర్గము. పా "క ఖ గ ఘ ఙ" (వర్ణవిభాగప్రకరణము —క ఖ గ ఘ ఙ-క వర్గము, చ ఛ జ ఝ ఞ-చ వర్గము, ట ఠ డ ఢ ణ-ట వర్గము, త థ ద ధ న-త వర్గము, ప ఫ బ భ మ-ప వర్గము. ఈ 25 అక్షరములకు 'స్పర్శము' లని పేరు ) చూ, స్పర్శములు

కవఱలు. దే వి. బ పాచికలు, ఆము 1, ఆ.59 చూ, పాచిక

కవలకాయ దే వి చూ, అమడకాయ

కవలవారు దే వి అమడలు చూ, యమళశిశువులు.

కవిజనరంజనము. పా ఈగ్రంథకర్త అడిదము సూరకవి (18 శతాబ్ది)
కవిజ్యేష్ఠము. సం. వి అ. పుం. వాల్మీకిముని. చూ, ముని. 1.
కవిడి. దే. వి చర్మవాద్యవిశేషము చూ, వీణె
కవిత సం వి ఆ. స్త్రీ. 1. పాత్రము. చూ, పుస్తకము, ఋ. పుం. 2. కవి చూ, మాటలల్లువాఁడు
కవిత్రయము. పా. నన్నయ, తిక్కన, ఎఱ్ఱన చూ, త్రియము. (చూ, కవులు)
కవిత్వము. సం వి. అ పుం. 1.= కయితము: చూ, మాటలల్లుట, అం 2 అవధానములు యెనిమిదింటిలో నొకటి చూ, అవధానములు
కవిత్వరచన. పా. ఛందస్సునకు సంబంధించినది (ఆశు, గర్భ, బంధ, చిత్రకవిత్వములు) చూ, ఉపవిద్యలు.
కవియము. సం వి అ పుం, స్త్రీ. కళ్ళెము చూ, వాగె.
కవియించు. దే స. క్రి రూ- కవించు చూ, వ్యాపించు.
కవియు దే. అ. క్రి 1 పర్వ, భార కర్ణ 2, ఆ. 281 చూ, వ్యాపించు, 2 కన్నువేయు చూ, దృష్టించు
కవియుదెంచు. దే అ క్రి (కవియు + తెంచు) కవియు, భార. విరా 5, ఆ. 192 చూ, వ్యాపించు, 2. కన్నువేయు చూ దృష్టించు
కవిరాజమనోరంజనము పా ఈగ్రంథకర్తకను పర్తి అబ్బయామాత్యుఁడు (18 శతాబ్ది)
కవిరాజవిరాజితము పా. ఒకానొక వృత్తము ఈవృత్తమునందొక్కొక్క పాదమునందు న, జ, జ, జ, జ, జ, జ, వ గణములుగలిగి ఎనిమిదింటఁ బదునాలుగింట నిరువదింట యతులుఁగల త్రియోవింశచ్ఛందస్సునందుద్భవించిన వృత్తము. ఉదా.— కలయఁగ నొక్కన,కారము నాఋజ, కారములున్వము, గాటము గానలరిపవోద్వార దాచలశైలము, లెత్రివిరామము, లందినిర। గ్గళ కవిరాజ వి రాజితవృత్తము, రాణజనార్దన రమ్యకథా। వళులఁగవీశులు, వర్ణనసేయఁగ, వ్రాలునజస్రము, వావిరిగ ॥" అప్ప 249 పుట
కవిరామాయణుఁడు. సం వి అ. పుం. వాల్మీకిముని: చూ, ముని. 1.
కవిరి వై వి.= ఖాదిరః కాఁచు చూ, రంగదము (గ్రహణికి మంచిది)
కవిరియుండ. ద్వ. వి. కాఁచువడియము. -వై.-
కవిల. వై వి = కపిలః కపిలవర్ణము, భార. ఆది 4, ఆ. 254 చూ, వర్ణము 6.
కవిలాసిక. సం. వి. అ స్త్రీ. వీణావిశేషము. చూ, వీణె
కవిలియ దే వి. ఘుట్టించిన నీలపటుపువర్ణ పుస్తకము లెక్కపుస్తకము "నీయుకవిలియ నీవ్రాసినలిపి" పాండు 5, ఆ. 52 చూ, పుస్తకము (రూ-కవిలె)
కవిలె దే వి —వై— "కవిలెలోనున్న ప్రకారంబు ప్రజ పాపపుణ్యముల్ చిత్రగుప్తుండు తెలుప." ఉ, రా. 3, ఆ 316. (గంటముతో వ్రాసిన తాటాకులప్రతి అనివాడుక)
కవివాల్మీకి సం. వి ఇ పుం చూ, కవిరామాయణుఁడు.
కవివేది సం విణ పండితుఁడు. చూ, విద్వాంసుఁడు
కవీయము సం వి. అ న కళ్లెము చూ, వాగె.
కవీశ్వరుఁడు. సం వి అ పుం 1 =కయిసరుఁడు కవులలో శ్రేష్ఠుఁడు. చూ, మాటలల్లువాఁడు, 2. అంచె చూ, హంస
కవీశ్వరులు. అం. సభాసప్తాంగములలో నొకరు చూ, సభాసప్తాంగములు. (చూ, అంగము 9)

కశిపువు. సం. వి. ఉ. పుం. 1. అన్నము చూ, సాదము (1), 2 బట్ట చూ, వస్త్రము, 3. అన్నవస్త్రములు చూ, కూడుగుడ్డ, 4. పఱుపు; భాగ 2, స్కం చూ, శయ్య. 1

కశీకరము సం వి. అ. పుం జలకణము చూ, నీరు 1.

కశేరుక. సం వి. ఆ స్త్రీ. వెన్నెముక చూ, శల్యము 1

కశేరుమధుర. సం. వి. ఆ. స్త్రీ. చ్యవమను గ్రింధ్యము చూ, రాజార్హము

కశేరుకము సం వి అ న 1 కమ్మరేఁగు * చూ, రేఁగు, 2 కొట్టిగడ్డ * చూ, సుపుష్పము, 3 వతురశ్రికము * చూ, ముళువెలఁగ

కశేరువు సం వి. ఉ పుం 1 గజవిశేషము చూ, హస్తి; 2 నుసురు చూ, లలాటము, 3 చుక్క చూ, బొట్టు. 1, 4 ముస్తె * చూ, తృణము 1, 5 జంబూద్వీపముయొక్క భాగములోనగు నది, 6. బంగారము చూ, లోహము 1, ఊ స్త్రీ 7 తృణకందము చూ, తృణము 1

కశ్మలము సం వి అ న 1 మూర్ఛ చూ, రోగము 1, పుం 2 నిషాదగ్రామము, బోయపల్లె చూ, దేశము, విశే 3 రూ-కస్మలము కలఁకఁబాఱినది చూ, మలినము 3 (తద్భ= కసుమాలము).

కశ్మీరము. సం వి అ. పుం. కాశ్మీరదేశము. చూ, దేశము.

కశ్మీరజన్మ. సం వి. న్. న. కుంకుమపువ్వు చూ, వహ్నిశిఖము.

కశ్యపనందనుఁడు సం. వి. అ పుం గరుత్మంతుఁడు చూ, హరివాహనుఁడు

కశ్యపము సం. వి. అ. పుం. చేఁప చూ, మత్స్యము 1.

కశ్యపుఁడు. సం. వి. అ పుం. కశ్యపముని, చూ, ముని. 1.

కశ్యము. సం వి అ. న 1 గుఱ్ఱము నడుము; చూ, హయము; 2 కల్లు చూ, సుర. 1, విశే. 3 కశకుఁదగినది

కశ్యుఁడు. సం విశే చూ, కశార్హుఁడు.

కష. సం వి. అ. స్త్రీ 1 దక్షునికూఁతులలో నొకతె, 2 పిన్నరేగడి దూలగొండ * చూ, స్వల్పదురాలభ

కషణము. సం వి అ న 1 ఒరయిక చూ, పీడనము, విశే 2. ఉడకనిది అపక్వము, ఆమము

కషణి సం వి ఈ. స్త్రీ. 1 కులట చూ, ఱంకులాఁడి, 2 కత్తెము చూ, వాగె.

కషము సం వి అ. పుం 1 ఒఱగల్లు చూ, నికషము, 2 శాణము చూ, సాన.

కషాకుఁడు. సం వి. అ పుం. 1. చాయమగఁడు చూ, సూర్యుఁడు, 2 అగ్ని చూ, నిప్పు

కషాయ సం వి అ. స్త్రీ. పిన్నరేగడిదూల * చూ, స్వల్పదురాలభ

కషాయకృత్తు సం వి. త్ పుం. ఎఱ్ఱలొద్దుగు* చూ, లొద్దుగు

కషాయపుష్పకము సం వి. అ న. చేండ్రి * చూ, విట్ఖదిరము.

కషాయఫలము సం. వి. అ న.—పై.—

కషాయము సం వి. అ పుం 1. ఒగరు చూ, రసము, 2.=కసియము కాచినసారము అను పానము, కసియము-రూ- కస్సెము. (మందుతోఁగూడ జేర్చి పుచ్చుకొనెడు రసమనికొందఱు), 3 పూసికొనెడి చందనాది చూ, సుగంధము, 4. చందనాదులపూఁత చూ, పూఁత, 5. ఎఱుపు ఎక్కువకలిసిన తెలుపు చూ, వర్ణము. 6, 6. క్రముకము * చూ పోఁక, 7 నిర్యాసము చూ, బ్రూనిబంక,

**కసరు.** దే. వి. 1. ఝుంఝు, వానగాలి, స్వా. 3, ఆ. 9: చూ, వాయువు, 2. రూ-కసురు. లజ్జ. చూ, సిగ్గు, 3 రూ-కసురు. కోపము, ఆము 5, ఆ 60. చూ, కోపము, 4 రూ-కసురు. తిట్టు: చూ, శాపము. 1, 5 రూ-కసురు, లాబము చూ, లాభము, అ. క్రి 6. రూ-కసురు చలించు, భాగ. 7, స్కం చూ, సలించు, స. క్రి 7 రూ-కసురు కోపించు "క అంపఁదగువారిఁ గసరుచు నంపి" స్వా. 5, ఆ. 7 చూ, కోపించు.

**కసవు** వై వి 1 = ఘాసః. కవను చూ, తృణము 1, 2 ఇంటిపెంట చూ, పెంట 1

**కసవుఁగుప్ప.** ద్వ వి (కసవు + కుప్ప) 1. ఇంటిపెంట చూ, పెంట. 1, 2. గడ్డివామి చూ, మేటి

**కసవోత్పాటనము.** సం. వి అ పుం. చూ, వాసకము *.

**కసాయి** దే వి ఆఘాతుఁడు. చూ, సంహారకుఁడు

**కసి** దే వి. 1 కోపము, "కసితీఱఁ గొట్టినది" చూ, కోపము; 2 దురద, హరి. ఉ 7, ఆ. 22 చూ, విదర్చిక, 3 కోరిక, హరిశ్చ 8, భా 890 చూ, వాంఛ, విణ 4 వృత్తియందుఁ గసిడి శబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలినరూపము. "కసి కాటు" మొ

**కసింద.** వై వి = కాసమర్దః రూ-కారకసివింద-కసివెంద * చూ, బలుసు. (దీనియందు క్రిమి సంహారశక్తికలదు) (దీనిభేదము తీఁటకసింద)

**కసిగాటు** దే. విణ అయిష్టభక్షణము

**కసిడి.** దే విణ. అల్పము, పాండు. 4, ఆ 42 చూ, స్వల్పము

**కసిపువు.** సం వి ఉ. పుం 1 అన్నము చూ, సాదము. (1), 2, వలువ. చూ, వస్త్రము, 3 అన్నవస్త్రములు చూ, కూడుగుడ్డ, 4. పఱుపు చూ, శయ్య. 1. (రూ-కశిపువు)

**కసిమసగు.** దే. అ క్రి 1. చెంగలించు, భార. ఉద్యో. 2, ఆ. 139. చూ, విజృంభించు, స. క్రి, 2 ఖండించు; రామా. 5, ఆ. 203 చూ, సెలగు, 3 చంపు. "క. అసురుల మాహోపాయులఁ, గసిమసఁగఁగ" రామా 4, ఆ 8 చూ, సంహరించు.

**కసిమసి** దే. వి. తొట్రుపాటు "క విళసనము చేయునోయని, కసిమసిబెగడొందు భూతగణము" భాగ 7, స్కం. 456 చూ, సంభ్రమము (రూ-కసిమస-కళవళము-కళవళపాటు-కనుకని-కన్కని-కప్పరము) (పు-క)

**కసిమిరి.** దే. వి దురద. "దానవుండైన నాకీవే చేతులు చేసితీ కసిమిరింకట్లోర్తుక" ఉ, హరి. 5, ఆ 19 చూ, విదర్చిక. (రూ-కసి-నసిమిరి-నస-నుస) (పుర-క)

**కసియము.** వై వి 1 = కషాయము. రూ-కసెము. కస్సెము చూ, కషాయము. 2, 2 రూ-కస్సెము నీటిఊటంగలతావు చూ, స్థానము 1

**కసివారు** దే వి. సవారిమార్గము రూ-అసివారు

**కసివెంద.** వై వి = కాసమర్దః. రూ-కసింద * చూ, బలుసు

**కసీదా, కసీదు** హిం వి వస్త్రముమీఁద పూలుబుట్టాలు కుట్టుట. (శ ర.)

**కసీసము** వై వి 1, నలుపు చూ, వర్ణము. 6, 2. నీలకలధౌత వస్త్రము చూ, వస్త్రము, వై. విణ 3 నల్లనిది, ఆము 4, ఆ. 10 చూ, వర్ణము 6.

**కసు.** దే. విణ వృత్తియందుఁ గసుగుశబ్దమునకు మీఁదివర్ణము లోపింపఁగా మిగిలిన రూపము "కసుగాయ." మొ

**కసుఁగందు.** దే. వి (కసురు + కందు) 1 నలుపు, మై. 1, ఆ చూ, వర్ణము 6,

